## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్: http://www.scribd.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు:sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు*

స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్:

**http://www.scribd.com**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పురుష సూక్త రహస్యం



పూజ్య ఆచార్య ఎక్కిరాల భరద్వాజ

# పురుషసూక్తము - వైజ్ఞానిక దృక్పథము

ఈ జగత్తంతటికీ మూల కారణమైన శక్తి ఒకటున్నది. ఆ శక్తే ఈ జగత్తురూపంలో వ్యక్తమై మనకు అనుభవమవుతున్నది. మనకు అనుభవమవుతున్న ఈ జగత్తు నిజానికి మన ఇంద్రియానుభవము మాత్రమే గానీ వాస్తవం కాదని, వాస్తవమైనది ఈ జగత్తు రూపంలో మనకు గోచరమవడానికి కారణమైన శక్తి లేక చైతన్యము మరొకటి వున్నదని మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ విషయాన్ని మన ధర్మశాస్త్రం ఇలా చెబుతుంది.

**అసీదిదం తమోభూతమప్రజ్ఞత మలక్షణం**
**అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః॥**

(ఈ ప్రపంచము మొట్టమొదట చీకటియై యుండెను. కనుకనే ప్రత్యక్షముగా కానరానిదియు, లక్షణములు లేనిదియు ఊహింపనలవి కానిదియు, శబ్దము చేత గమ్యము కానిదియు అయి అంతయూ నిద్రించుచున్నట్లుండెను)

సృష్టికాధారమైన శక్తిని నేటి భౌతికశాస్త్రము పరిశోధనలు ద్వారా నిరూపించింది. మనకు గోచరమయ్యే పదార్థమంతా సూక్ష్మ కణాలతో చేయబడినదనీ,అవి 'ఎలక్ట్రాన్లు, 'ప్రోటాన్లు', 'న్యూట్రాన్లు' అను మూడు రకాలుగా వుంటాయని భౌతిక శాస్త్రం చెబుతుంది. ఎలక్ట్రాన్లు ప్రోటాన్లు రెండు రకాల (ధన, ఋణ) విద్యుదావేశం కలిగివుంటాయి. ప్రతీపదార్థము యిట్టి కణాలతో కూడిన పరమాణువలతో నిండివుంటుంది. ప్రతిపరమాణువులో కూడా ఈ రెండు రకాల కణాలు అతి సన్నిహితంగా వుంటాయిగాని ఒక దానితో ఒకటి ఎప్పుడూ కలవవు. కలసినట్లయితే ఒకదానిని ఒకటి అంతర్హితం చేస్తాయి. అప్పుడు పదార్థమే లేకుండాపోయి 'ధార్మికశక్తి' గా మారిపోతుంది. 'ధార్మికశక్తి' అన్న కోవకు చెందిన కాంతి, వేడి, రేడియో తరంగాలు, ఎక్సరే మొదలైనవాటి తత్వాన్ని శాస్త్ర దృష్ట్యా పరిశీలించినట్లయితే ఒకే శక్తి తరంగంగాను, కణంగాను ప్రవర్తిస్తుందని తెలుస్తుంది. ఆ పరిశోధనలే పరమాణువు కణం గాను తరంగవిశేషంగానూ కూడా ప్రవర్తిస్తుందని ఋజువుచేశాయి. ఈ అతిసూక్ష్మమైన

Note:This book contains printing mistakes in the sanskrit verses

కణాలకి వ్యక్తిగతమైన ఉనికి లేదని భౌతిక శాస్త్రకారులు చెబుతారు. ఆ శుద్ధశక్తి తరంగంగాను కణంగాను ప్రవర్తించడం వలన సృష్టిలోని వైవిధ్యానికి కారణమయింది. అంటే వైవిధ్యానికి ఆధారం ఒకే తత్వమన్నమాట. అటు ఎలక్ట్రాన్ ప్రోటాన్‌ల వంటి అతి చిన్నవాటినుంచీ అతి పెద్దవైన నక్షత్రకోవలదాకా అన్నీ ఒకే పదార్థంతో చేయబడివున్నాయన్నమాట.

ఆధునిక భౌతిక శాస్త్రం సృష్టిరహస్యాన్ని అన్వేషించటంలో శక్తి, శక్తి ప్రసార విశేషాల దాకా వచ్చి నిలిచిపోయింది. ఆధునిక శాస్త్రజ్ఞులు పరిశీలించినట్లుకాక యోగులు, ఋషులు, తమ దేహరూపంలో అతి సన్నిహితంగా వారిలో భాగమైయున్న పదార్థాలను తపస్సుద్వారా గ్రహించి, ఆ పదార్థ రూపంలో వున్న — ఈసృష్టి కంతకు ఆధారమైన మూలశక్తిని దర్శించి, దానియొక్క సహజచైతన్యస్థితిని అనుభవ పూర్వకంగా గుర్తిస్తారు.

అదేవిధంగా ప్రాణశక్తియే రూపంలో యే కేంద్రంలో వుంటుందో, దానిని ధ్యానిస్తే తనలోని చైతన్యస్థితి యే ఉన్నత కక్ష్యలను పొందుతుందో యోగశాస్త్ర గ్రంథాలలో చెప్పబడివుంది. అలా సాధనచేస్తే సృష్టిస్థితి లయాలను ఆద్యంత రహితమైన పరిణామాలను పొందుతూ, వాటిని పొందటానికి హేతువుకూడా తానే అవటం ద్వారా ఆ స్థితులకు అతీతము, ఆధారమూ అయిన చైతన్యశక్తి తానేనని స్వానుభవస్థితి వరకూ మానవుడు పొందవచ్చునని చెప్పబడివున్నది. తనలోని చైతన్యశక్తే సృష్టిస్థితుల కతీతమైన చైతన్య శక్తిగా గుర్తించటంద్వారా సృష్టిలోని ప్రతిఅణువు తమచేత నింపబడివున్నట్లు అనుభవిస్తారు యోగులు.

ఈ సృష్టి అంతటిలో బ్రహ్మాండాల నుండీ పరమాణువల వరకూ వున్న అంశాలు ఏశక్తియొక్క తరంగ సముదాయాలో, ఆ శక్తినే భక్తులు దైవమనీ, జ్ఞానులు ఆత్మఅనీ, శాక్తేయులు శక్తి అనీ, ఋషులు సత్యమనీ అంటారు. వారి స్వభావ భేదాలనుబట్టి వారి భావాలు యీ వివిధ పాదాలలో వ్యక్తమవుతాయి.

ఆదిలో వున్నటువంటిది చైతన్యశక్తిగనుక దానికి 'ఏఋక' అన్నది ఒకపేరు. అంటే తన ఉనికిని సదా అనుభవిస్తూ, తన ఉనికియొక్క స్ఫురణను కలిగివుంటుంది.

Note:This book contains printing mistakes in the sanskrit verses

ఆ శక్తి చైతన్య మవటం వలన ఊహాశక్తి కలిగి ఉంటుంది. అంటే ఒకటే అయిన చైతన్యం వివిధ రూపాలు ధరించగల శక్తి కలిగివుండటమన్నమాట. ఎలాగైతె మన మనస్సు ఒక సన్నివేశాన్ని గ్రహించినపుడు అందులోని దేశకాలాలు, వ్యక్తులు వారిక్రియలు ఆ మనస్సే అయి, ఆ కల్పితరూపాలనుచూచి అనుభవించే శక్తి కలిగి వుంటుందో అదేవిధంగా 'చైతన్యం' ఊహాశక్తిని కలిగివుండి సృష్టిలోని వస్తుబాహుళ్యరూపం ధరించింది. అందుకే ఆదిలో ఒక బ్రహ్మ మాత్రమేవున్నాడనీ, ఆయన తాను వివిధములుగా అవ్వాలని తలచాడనీ, అందువలన బహుధా అయ్యాడనీ ఉపనిషత్తులు చెబుతాయి. ఈ విషయాన్నే మనుధర్మశాస్త్రం ఇలా చెబుతుంది.

**తతస్స్వయంభూర్భగవా నవ్యక్తోవ్యంజయన్నిదం**
**మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీత్త మోనదః**

(సర్వశక్తి సమన్వితుడై నటువంటి వాడును, యోగాభ్యాసముచే నెఱుగదగిన వాడును, అడ్డులేని సృష్టి సామర్థ్యము గలవాడు నగు పరమాత్మ తనంతటతానే ఉద్భవించి, యీ మహాభూతాదులను ప్రకాశపరచుచు, ప్రకృతి ప్రేరకుడైయావిర్భవించెను.)

మన స్వప్న దేహానికి స్వప్న జగత్తే వాస్తవమూ భౌతికమూ ఎలా అవుతుందో, అలాగే ఈ జగత్తనే భగవంతుని ఊహలో ఆయన ఊహా దేహాలమైన మనకు, ఆయన ఊహా రూపమైన ఈ ప్రపంచము వాస్తవమూ, భౌతికమూ అవుతుంది. అయితే భగవంతుని చైతన్యం సృష్టి అనే ఊహల రూపం ధరించింది కాబట్టి ఈ జగత్తే భగవంతుడా? అదికాక దైవం లేదా? అన్నది ప్రశ్న.

మన మనస్సు ఊహలరూపం ధరించినపుడు మనచైతన్యంలో ఒకభాగం మాత్రమే ఆ ఊహలరూపం ధరించి, ఒకభాగం మాత్రం ఆ ఊహలను ఊహిస్తూ చూడడమనే క్రియతప్ప మరేమీ చేయక 'సాక్షి'గా వుండిపోతుంది. అలాగే భగవంతుడనె మహాచైతన్యంలో కొంతభాగమే సృష్టిరూపం ధరించి, కొంత సాక్షీభూతంగావుండి ఈ సృష్టి నంతటినీ చూచి అనుభవిస్తూంటుంది. ఈ విషయం పురుషసూక్తంలో వివరంగా

Note: This book contains printing mistakes in the sanskrit verses

చెప్పబడివుంది.అందుకనే భగవంతుణ్ణి **'సాక్షి' అనీ** 'సకల**భూత హృదయాంతరస్థుడు, విరూపాక్షుడు' అనీ** చెబుతారు. ఈ విషయమే **పురుషసూక్తంలో "పాదో స్య విశ్వా భూతాని..."** అని చెప్పబడింది. అంటే అతనిలో ఒక భాగం మాత్రమే విశ్వము, భూతములు అయినవి అని అర్థము.

మనకు స్వప్నంలో కనబడే వ్యక్తుల రూపంలోనూ వారి లోపల బయట అంతా మన చైతన్యమే ఎలా వ్యాపించి వుంటుందో సృష్టికర్త కల్పనలమైన మనలోపల బైటా అంతా 'దైవము" లేక ఆది చైతన్యము అలాగే వ్యాపించి వుంటుంది. దానినే వేదం "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః" అని చెబుతుంది. అంటే సర్వత్ర (లోపల బయట) నారాయణుడే వ్యాపించి వున్నాడని అర్థము.

అదిలో ఒకటే అయిన చైతన్యం తన భావనచేత అనేక రూపాలను ధరించి పొందిన ఆనందాన్నే తాత్కాలికంగా మానవుడు కూడా కొంతవరకూ అభినయము మొదలైన కళలలోగానీ సాహిత్య సృష్టిలోగాని పొందుతున్నాడు. కళలద్వారా దైవసృష్టి క్రమాన్ని అందులోని ఆనందాన్ని మచ్చుచూస్తాడు గనుకనే సకల కళలకూ మన పూర్వీకులు ఒక దైవత్వం, ఆధ్యాత్మిక ప్రయోజనం, దివ్యమైన ఉత్పత్తి వున్నాయని వ్రాశారు. ఆ ప్రయోజనంకోసం ఆకళలను అభ్యసించినట్లయితే అవి దివ్యానుభూతికి దారితీస్తాయి. లేకపోయినట్లయితే అవే అవినీతికీ, అధఃపతనానికి, తద్వారా జాతి యొక్క పతనానికి దారితీస్తాయి.

ఈ సృష్టిలో అన్నిరూపాలను ధరించినది ఒకే ఆదిశక్తి గనుక మనమేవస్తువునైనా తీవ్రంగా ధ్యానిస్తే, ధ్యానింపబడే రూపానికి ధ్యానించే మనకూ ఆధారమైన ఆచైతన్యం మనకనుభవమై క్రమంగా యోగ పరిపూర్ణత (యోగశాస్త్ర పరిభాషలో) లభిస్తుంది.

అయితే ఆది చైతన్యాన్ని మనం ఆవిధంగానే వ్యవహరించక 'బ్రహ్మ', 'విష్ణువు' , 'శివుడు' అని పిలవడమెందుకు? అనవచ్చు. బ్రహ్మ అంటే 'అంతటా నిండియున్నట్టి' అనీ. విష్ణు అంటే 'వ్యాపించినట్టి' అనీ, శివుడంటే 'పరిపూర్ణమనీ' అర్థం అని తెలుసుకోవాలి. ఈ సమగ్ర రూపాన్ని గుర్తుంచుకుంటూ చదివే స్తోత్రాదులు ఎంతో ఆధ్యాత్మిక ఫలితాన్నిచ్చి అసంఖ్యాకమైన విషయాలు తెలుసుకోవడానికి దోహదం చేస్తాయి.

Note: This book contains printing mistakes in the sanskrit verses

సర్వత్రా నిండియున్న ఆది చైతన్యం సంకల్పం మాత్రం చేత ఈ చరాచర జగత్తులోని వివిధ రూపాలను ధరించి, ఆయా రూపాల ద్వారా జరుగుక్రియలు. క్రియలకు కారణము తానే అయివుండీ వాటిని చూడడమనే క్రియతప్ప మరేమీ చేయక సాక్షీభూతంగా కూడా తనే వుండివుంటుందని తెలుసుకున్నాము.

ఇంకోవిధంగా చెప్పాలంటే సృష్టికి ఆధారమైన చైతన్యం ప్రత్యేకత కలిగిన వివిధ స్థాయిలుగా ఏర్పడటంద్వారా వివిధ పదార్థ బాహుళ్యం యేర్పడి ఒకదాని నుండి ఇంకొకటి భిన్నమైవుండటానికి కారణమవుతుంది. ఈ విధంగా జరిగిన సృష్టిని, సృష్టికాధారమైన చైతన్యము లేక 'పురుషుని' పురుషసూక్తము వివరంగా వర్ణిస్తుంది.

సకల జీవరాసుల రూపంలో వ్యాపించి విశ్వమంతటా ఆయనే తిరుగుతున్నాడు గనుక పురుషసూక్తంలో పురుషుడు అనేక శిరస్సులు, నేత్రములు, పాదములు కలవాడని చెప్పబడినది.

ఆదిలోని చైతన్యం వివిధ స్థాయిలుగా యేర్పడినప్పుడు వ్యక్తిత్వం కలిగిన ఒక్కొక్క స్థాయిని ఒక్కొక్క దేవతగా పేర్కొన్నారు. ఈ సృష్టిజాలమంతా ఇట్లా ఏర్పడిన వివిధ దేవతలందరూ కలసి సమిష్టిగా నిర్వహించే ప్రక్రియే.

సృష్టికి పూర్వము ఆదిపురుషుని యజ్ఞపశువుగాచేసి ఋషులు యజ్ఞం చేశారని పురుషసూక్తంలో చెప్పబడివున్నది. అయితే సృష్టికి పూర్వము యజ్ఞము చేశారని చెప్పబడిన ఋషులు ఎక్కడ నుంచి వచ్చారన్నది ప్రశ్న. ఈ జగత్తుయొక్క సృష్టికిముందు జరిగిన దేవతాసృష్టి క్రమములో మొదట వుద్భవించిన బ్రహ్మదేవుడు మొట్టమొదట సనక, సనందన, సనాతన, సనత్కుమారులను ఋషులను సృష్టించి, వారిని సృష్టిచేయుటకు నియమించారని, వారు అందుకు నిరాకరించి జిజ్ఞాసువులై తపస్సులో నిమగ్నులయ్యారనీ భాగవతంలో చెప్పబడినది.

తరువాత బ్రహ్మదేవుడు పదిమంది ఋషులను సృష్టించాడని వారు బ్రహ్మదేవుని శరీరంలో నుండి వుద్భవించారని వారు :

1. నారదుడు 2. దక్షుడు 3. వశిష్టుడు 4. భృగువు 5. క్రతువు 6. పులహుడు 7. పులస్త్యుడు 8. అంగిరసుడు 9. అత్రి 10. మరీచి.

Note: This book contains printing mistakes in the sanskrit verses

అనికూడా భాగవతంలో చెప్పబడింది. దీనినే మనుస్మృతి ఇలా వివరిస్తుంది.

**అహం ప్రజాస్సిక్షుస్తు తపస్తప్త్వా సుదుశ్చరమ్**
**పతీన్ ప్రజానామస్పజం మహర్షీనాదితోదశ**
**మరీచి యత్రంగిరసౌ పులస్త్య పులహం క్రతుమ్**
**ప్రచేతసం వశిష్ఠంచ భృగుం నారదమేవచ**

ఈ ఋషులంతా సమిష్టిగాకలసి సృష్టికార్యం కొసం చేసిన ప్రక్రియనే పురుష యజ్ఞంగా పురుషసూక్తంలో చెప్పబడింది. ఆదిశక్తి నుండి ఉత్పన్నమైన సృజనాత్మకశక్తి స్థాయిలే ఈ ఋషులు. తదనంతరం జరిగిన సృష్టంతా వాటి సామూహిక క్రియ.

ఈ పురుషుడి దేహం నుండే ఇతర దేవతలు భూమి, సూర్యుడు గ్రహాలు మొదలైనవన్నీ పుద్భవించడం, క్రమంగా స్థావరజంగమాలైన ప్రాణి సమూహాలు ఆ తరువాత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణాలుగా మానవులు ఉద్భవించడాన్ని పురుషసూక్తం వివరంగా తెలుపుతుంది. ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చాతుర్వర్ణ్య వ్యవస్థ ఏర్పడటం గురించి మనుస్మృతిలో గూడా వివరించబడివుంది.

**'యంతుకర్మాణి యస్మిన్ సన్యయుజ్ఞ్య ప్రథమం ప్రభుః**
**సతదేవం స్వంభేజే సృజ్యమానః పునః పునః"**

అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు జాతులు సృష్టించబడి యేజాతికి యేగుణము నియమించబడిందో తరువాత గూడా ఆయా జాతులు ఆ గుణాలనే పొందాయని అర్థము.

అట్లాగే శరీరంలోని వివిధ భాగాలకు గల ప్రాధాన్యత, స్వభావాలనుబట్టి, 'పురుషుని' వివిధ భాగాలనుండి వివిధ వర్ణాలవారుద్భవించినట్లు పురుషసూక్తంలో చెప్పబడింది. (**"బ్రాహ్మణో౽ స్యముఖ మాసీత్, బాహూరాజన్యః కృతః ఉరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాంశూద్రో అజాయత"**) దీనినే మనుస్మృతిలో ఇట్లు చెప్పబడి వుంది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

"లోకానాంతు వివృధ్యర్థం ముఖబాహూరు పాదత:
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయాత్"

దేవతలు, ఋషులు సమిష్టిగా నిర్వహించే సృష్టి క్రియనే యజ్ఞంగా పురుషసూక్తం చెబుతుంది. ఈసృష్టి అనే జగత్క్రీడలో ఒక్కొక్క దేవత ఒక్కొక్క పాత్రను ధరిస్తుంది గనుక సృష్టికి ధర్మము మూలమని చెప్పబడింది. ఈజగత్క్రీడ అనే యజ్ఞాన్ననుసరించి నడవడానికీ, అట్టి జ్ఞానాన్ని పొందటానికీ కావలసిన జీవిత విధానాన్ని మానవ ధర్మమన్నారు. భగవద్గీతలో స్వధర్మమనే యజ్ఞ వ్యవస్థ గురించి చెప్పబడింది, ఎవడి స్వధర్మమేదో దానినే నిత్య యజ్ఞమని స్వధర్మాచరణమువల్ల నిత్యం యజ్ఞకర్మ జరుగుతుందనీ, దానివల్ల జీవులకు కర్మబంధ విముక్తికలిగి ఐహికాముష్మికములు నెరవేరతాయనీ, ఈ స్వధర్మమనే యజ్ఞవ్యవస్థ వివిధ కులాల ననుసరించి వారు ఆచరించటానికి బ్రహ్మచే సృష్టింప బడిందనీ భగవద్గీత చెబుతుంది. యీ వర్ణధర్మం గూడా ఆయా జీవుల సహజగుణాలనూ తదనుశృతమైన కర్మభేదాల వలన సహజంగా ఈ ప్రకృతిలోనే ప్రవర్తిల్లుతుందనీ భగవద్గీతలో భగవంతుడిలా చెబుతారు :

**"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః"**

ఆయా జీవుల ప్రకృతి సిద్ధమైన గుణాలననుసరించి కర్మలననుసరించి ప్రకృతిలోనే నాల్గు విధాలేర్పడ్డాయని అర్థం. సృష్ట్యాదిలో ఆయా ధర్మాలుగల జీవులుత్పన్నం కావడానికి కారణం క్రిందటి ప్రళయానికి ముందు ఆయా జీవులు చేసిన కర్మల ప్రభావంచేత ఆయా సంస్కారాలను పొంది, దానిననుసరించి ఇప్పటి సృష్టిలో ఆయారీతుల ఉత్పన్న మవుతాయి.

అంటే ధర్మాన్ననుసరించడం ద్వారా మానవుడు యీ సృష్టి అంతటికీ ఆధారమైన చైతన్యాన్ని అనుభవంద్వారా తనలోని 'నేను' గా గుర్తించి, సృష్టినుంచి తాను వేరనే భ్రాంతిని రూపుమాపడమే శాంతి ఆనందాలకు మార్గమని మన పూర్వ ఋషులు దర్శించారు.

మనలో ఈజ్ఞానాన్ని మేల్కొల్పడానికి అనువైన అనేక దేవతామూర్తులను తత్సంబంధమైన మనలోని చైతన్యాన్ని ప్రేరేపించగల వివిధ స్వరాలు కలిగిన

Note: This book contains printing mistakes in the sanskrit verses

వేదమంత్రాలను వివిధ ప్రభావాలు కలిగిన పదార్థాలతో యజ్ఞం చేసి, దానిద్వారా మనలోని చైతన్యకక్ష్యను వృద్ధి చేసుకొని, అనుభవపూర్వకంగా సృష్టితో తదాత్మ్యాన్ని పొందడమే యజ్ఞంయొక్క పరమావధి.

ఈ సృష్టిఅంతా ఒకే యజ్ఞం అయినా సులభంగా అవగాహన కావడానికి మానవుడు ఆ యజ్ఞాన్ని వివిధ కక్ష్యలలో చూస్తాడు. సృష్ట్యాదిలోని ఒకేశక్తి పంచభూతాలుగా సృష్టిఅయి, తిరిగి పరస్పర కలయికల వలన స్థూల భూతాలుగా అవటాన్ని 'పంచీకరణవిద్య' వివరిస్తుంది. ఇది ఒక కక్ష్యకు చెందిన యజ్ఞం.

సూర్యాది గ్రహాల కదలికలవలన ఏర్పడిన కాలము, కాలగమనమువలన ఏర్పడిన దివారాత్ర సహితమైన కాలచక్రము మరొక యజ్ఞకక్ష్య. సప్తగ్రహాల పరిధిలోని ఈ సంవత్సరాత్మకమైన యజ్ఞము పురుషసూక్తంలో 'సప్తాస్యాసన్ పరిధయః' అని చెప్పబడినది. ఈకాల స్వరూపమగు యజ్ఞముయొక్క స్వరూపాలే ఇరువది యేడు నక్షత్రములు ("నక్షత్రాణిరూపమ్") దీనినే ఆకాశములో విస్తరింపజేసిన యజ్ఞము ("దేవాయద్యజ్ఞం తన్వానా") అని చెప్పబడినది.

పంచభూతాలతో నిర్మింపబడినా సృష్టిఅంతా సృష్టింపబడి లయం చెందటం మరొక యజ్ఞకక్ష్య. దీనిలో బ్రహ్మాండాల సృష్టి లయాలు చెప్పబడతాయి.

ఒక జీవి రూపుధరించి, జీవించి, లయించడం మరొక యజ్ఞం. జీవులు ప్రకృతితో సమన్వయపడిన జీవిత నిర్వహణ ఒక యజ్ఞకక్ష్య.

ఈ విధంగా ఏర్పడిన వ్యక్తి జ్ఞానేంద్రియాలతో చేసేదొక యజ్ఞకక్ష్య. పంచకర్మేంద్రియాలతో, సప్త ధాతువులతోవున్న శరీరంలో జరిగేది వేరొక యజ్ఞకక్ష్య.

అలాగా సామాజిక జీవితం ఒక యజ్ఞం. శరీరంలోలాగే సమాజంలో కూడా వివిధ పనులు నిర్వహించే వ్యక్తులు వివిధ మనఃప్రవృత్తులు గలవారిగా జన్మిస్తారు. సమాజమంతా ఒక శరీరంగా, అందులోని వివిధ ప్రవృత్తులు గలవారంతా ఆ శరీరంలోని అంగాలలాగ సమిష్టి శ్రేయస్సుకోసం కలసి ఎలా పనిచేయాలో సూచించే నిమిత్తమే పురుషసూక్తంలో యజ్ఞపురుషుడి వివిధ శరీరభాగాల నుండి వివిధ వర్ణాలవారుత్పత్తి అయినట్లు చెప్పబడింది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

ఇలాగే భగవద్గీతలో వివిధ యజ్ఞాలను గురించి చెప్పబడినది ఎవరు యోగమనే అగ్నిహోత్రమును ప్రారంభించి, గురూపదేశమనే మంత్రాగ్నిలో మనస్సుతోబాటు అజ్ఞానాన్ని గూడా ఆహుతి నిస్తారో అట్టివారు యోగయజ్ఞాన్ని ఆచరించి తద్వారా ఆత్మసుఖాన్ని పొందగలరని చెప్పబడింది. ఇంకా యితర యజ్ఞాలను భగవద్గీత ఇలా వివరిస్తుంది.

ఇంద్రాది దేవతలను ప్రసన్నం చేసుకోవడానికి చేసేయజ్ఞాన్ని "దేవయజ్ఞం" అంటారు. జ్ఞానమువలన బ్రహ్మమనే జ్ఞేయము ప్రాప్తించే యజ్ఞాన్ని జ్ఞానయజ్ఞమంటారు. ఈ జ్ఞానయజ్ఞం ముందు జడయజ్ఞాలన్నీ నిస్తేజములైపోయి తుచ్ఛమైన వౌతాయి.

కొందరు శబ్దాలనే హోమము చేస్తారు. దీనినే వాగ్యజ్ఞమని అంటారు. వేదాలలో చెప్పబడిన ద్రవ్య యజ్ఞము, తపో యజ్ఞము యోగ యజ్ఞములను ఆచరిస్తారు. జడ యజ్ఞములు కాని యజ్ఞాలనాచరించు వారందరూ మోక్షాన్ని కోరతారని చెప్పబడింది.

జన్మించిన మానవుడు అటు బ్రహ్మాండాల ఉత్పత్తినుంచీ యిటు పిండోత్పత్తిదాకా ఒకే యజ్ఞ స్వరూపమని జ్ఞాన యజ్ఞాలద్వారా గుర్తించడమే పరమావధి. ఈ జ్ఞానాన్ని అనుభవపూర్వకంగా గుర్తించినవాడే శ్రీకృష్ణుడంతటి యజ్ఞ పురుషుడౌతాడు.

అయితే అందరు వ్యక్తులూ ఈ సమగ్ర యజ్ఞ అవగాహన పొందగలుగుతారా అనవచ్చు. అంతశ్రద్ధ పట్టుదల గల కొందరు ఋషులే యజ్ఞంద్వారా పరిపూర్ణతను పొందగలవారు. సత్యద్రష్టలైన ఋషులు సకల జగత్తునూ భగవత్స్వరూపంగా గుర్తించి అందులో వారుకూడా ఈ సృష్టియజ్ఞం నిర్వహించడానికి కల్పించబడ్డామని గుర్తించి, మానవుల రూపంలోవున్న దైవప్రీతి కోసం సామాన్య మానవులకుకూడా ఐహికాముష్మిక సుఖ శ్రేయస్సులను ప్రాప్తింపజేసే జీవిత పంథాను నిర్మించారు. ఈసృష్టిక్రమాన్ని ప్రకృతి పరిణామాన్ననుసరించి నడిపించే చైతన్యశక్తే ఋషులు. వీరు ఈ సృష్టి తన క్రమాన్ని తప్పి అసందర్భమైన మార్పులకు గురికాకుండా క్రమ మార్గాన్ననుసరించి నడవడానికి ఆధారమైనవారు.

ఇలాగ ఈ జగుత్తులోని సకల జీవరాసులు వాటి సృష్టి స్థితి లయాలు, జీవపదార్థాలు, వాటి ప్రక్రియలు ఇవన్నీ ఒక క్రమమార్గంలో జరగడానికి కేవలం

Note: This book contains printing mistakes in the sanskrit verses

యాంత్రికమైన రసాయనిక ప్రక్రియల వలన, జడమైన అణువుల కూర్పులవలన మాత్రమే వీలుకాదనీ, దీనికంతటికీ అతీతమైన, సైన్సుకందని ఒకశక్తి కారణమనీ నేటి రసాయనిక శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

పందొమ్మిదవ శతాబ్దంలో జరిగిన జీవపదార్థ ప్రక్రియలను గూర్చిన పరిశోధనలవలన జడపదార్థానికి సంబంధించిన ప్రకృతి సూత్రాలే జీవపదార్థానికి గూడా అన్వయిస్తాయన్న భావం శాస్త్రీయ రంగంలో బలపడింది.

ప్రాథమిక కణాలమధ్య జరిగే ఆకర్షణ. వికర్షణ మొదలైన యాంత్రిక ప్రక్రియలే అన్ని జీవ ప్రక్రియలకూ ఆధారమని, ఇరవయ్యవ శతాబ్దపు భౌతికశాస్త్రజ్ఞుల సిద్ధాంతాల సమీకరణల సహాయంతో జీవపదార్థకత ప్రక్రియలను వివరించవచ్చని తలచారు. జీవదేహాలలో లభించే యూరియాను శాస్త్రజ్ఞులు ప్రయోగశాలలో కృత్రిమంగా తయారు చేయడంవలన అటుతర్వాత డార్విన్ సిద్ధాంతాన్ని నిర్వచించినపిదప జీవం జడపదార్థజనితమన్న భావం ధృవపడింది. జీవకణాలలోని రసాయనిక పదార్థాలు కర్బనము, ఉదజని, నత్రజని మొదలైన మూలకాల పరమాణువుల కూర్పుఅని గమనించి జీవపదార్థనాన్ని ప్రయోగశాలలో సృష్టించవచ్చని శాస్త్రజ్ఞులు తలుస్తున్నారు.

కానీ ఈ భావం సరైనది కాదనీ, శాస్త్రజ్ఞులు జీవ ప్రక్రియలో ఉత్పన్నమయ్యే పరమాణు కూటములను మాత్రం కనుగొన్నారు గానీ అట్టి కూటముల వలన జీవశక్తి ఏర్పడుతుందని తలచడం పొరపాటని 'డి. సింగ్' మరియు 'థామ్సన్' అను శాస్త్రజ్ఞులు తలుస్తున్నారు.

ఏకకణ జీవులలో పెద్దఎత్తున జరిగే ప్రక్రియలన్నీ కూడా ఎలా నిర్వహించ బడుతున్నాయో మనకు సంపూర్ణంగా తెలియదు. అనేక కణజీవుల సంగతి చెప్పవసరంలేదు. సుమారు 1100 అమీనో ఆమ్లాలతో చేయబడిన ఎంజైముల చర్యలసలే అర్థంకాలేదు. జీవపదార్థం జడపదార్థ కణాలమధ్య పనిచేసే యాంత్రిక ప్రతిక్రియల ఫలితమేనన్నది అంధవిశ్వాసం మాత్రమే. జీవకణాలలో వుండే విటమిన్లు, ప్రొటీన్లు మొదలైన రసాయనిక పదార్థాలను శాస్త్రజ్ఞులు తయారు చేయగలిగారుగాని నేటి పరిశోధనలన్నీ జీవ తత్త్వాన్నర్థం చేసుకోవడానికి చాలవని శాస్త్రజ్ఞులు నిరూపించారు. నోబుల్ బహుమతి గ్రహీత, శాస్త్రజ్ఞుడు అయిన సెంట్‌గ్యోర్గీ((Szent Gyorgi) ఇలా అంటారు.

Note: This book contains printing mistakes in the sanskrit verses

"జీవ రహస్యాన్నన్వేషించడంలో నా పరిశోధన జీవమేలేని పరమాణువుల, ఎలక్ట్రాన్లవరకూ వచ్చి నిలిచిపోయింది. మధ్యలో ఎక్కడో 'జీవము' నాపట్టు తప్పించుకొన్నది. కనుక వృద్ధాప్యంలో నా అభిప్రాయాలనుపసంహరించు కోవలసి వస్తున్నది" (Biology Today) అణువుల పరమాణువులు నిర్జీవములు. DNA అణువుగానీ అట్టి అణువుల సమూహంగానీ జీవం కాజాలదు.

రసాయనిక పరిణామ సిద్ధాంతం మూడు ప్రాతిపదికలపై ఆధారపడి వుంటుంది.

1. మొట్టమొదట వాతావరణంలో ఆమ్లజని తక్కువగా వుండేది.

2. ఇట్టి వాతావరణంలో అమినో ఆమ్లములు మొదలైన ప్రాథమిక అణువుల కూర్పులు అల్ట్రావైలెట్ (Ultra Violet) ధార్మిక శక్తి మొదలైన ప్రభావాల వలన జరిగాయి.

3. వీటినుంచి కాలక్రమేణ జీవపదార్థంలో ముఖ్యాంశాలేర్పడి చివరకు జీవపదార్థమేర్పడింది.

ఈ ప్రాతిపదికలను గూర్చిన స్వల్ప ప్రస్తావన ఇక్కడ అవసరం. సృష్ట్యాదిలో మిథేన్ అమ్మోనియా, నీటిఆవిరి, హైడ్రోజన్, సల్ఫైడ్ వంటి పదార్థాలతో వాతావరణమంతా చేయబడివున్నదనీ ఆ వాతావరణం ప్రధానంగా క్షయకరమనీ 'ఓపారిన్' (Oparian) అను రష్యన్ శాస్త్రజ్ఞుడు ప్రతిపాదించారు. వీరి అభిప్రాయం నిరాధారమని భూగర్భ శాస్త్రజ్ఞులు, భూభౌతిక శాస్త్రజ్ఞులు (Geophysicist) , జీవ రసాయనిక శాస్త్రజ్ఞులు, ఎబల్సన్ (Abelson), డేవిడ్సన్ (Davidson) , బ్రింక్‌మన్ (Brinkman) , వంటివారు శాస్త్రీయంగా నిరూపించారు.

అలాగే జీవకణాల ప్రాథమిక దశలను గూర్చి 'ఓపారిన్', 'ఫాక్స్' అను శాస్త్రజ్ఞులు వేసిన అంచనాలు నిరాధారమని 'జోంగ్' వంటి శాస్త్రజ్ఞులు నిరూపించారు. అలాగే మూడవ ప్రాతిపదికకూడా ఊహజనితమేనని నిరూపించబడింది.

స్వతంత్రంగా జీవించగల అతి సూక్ష్మమైన 'బాక్టీరియా' లో జరుగు జీవప్రక్రియలలో బృహత్తరము, జటిలము, అయిన కూర్పు కలిగిన కొన్నివేల ప్రొటీన్ అణువులుంటాయనీ, ఒక్కొక్క దానిలో 300 అమినో ఆమ్ల కూర్పులుంటాయనీ, శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఇట్టి క్లిష్టమైన జీవపదార్థం ప్రకృతిలో కాకతాళీయంగా ఏర్పడేదేనని తలపడం దుస్సాహసమే.

అనేకములు పరస్పర ఆధారములు అయిన జీవకణాంశాలన్నీ సక్రమంగా పనిచేయటమనేది అట్టి అంశాలు సరైన ప్రమాణంలో ఏర్పడటంపై ఆధారపడుతుంది. ఇట్టి వ్యవస్థ మొట్టమొదట ఎలా ఏర్పడిందన్నదే సమస్య. 'ఇన్సులిన్' వంటి అతి సూక్ష్మమైన అణువు దానికై అదే ఏర్పడటానికి కోటానుకోట్ల సంవత్సరాలలో ఒక్క అవకాశం కూడా లేదనీ 'డి. సింగ్ థామ్సన్' అను శాస్త్రవేత్తలు గణిత శాస్త్రప్రకారం గణించి నిరూపించారు. కనుక సృష్టిలో కాలగతిన కాకతాళీయంగా వాటికై అవే జీవకణాలేర్పడే అవకాశం లేదు. మన కంతుపట్టని వేరొక శక్తేదో అందుకు కారణమై యుండాలి. అందుకే ఫ్రెంచి భౌతిక శాస్త్రవేత్త 'డీబ్రోగ్లీ' (De Broglie)యిలా అంటారు; "జీవ ప్రక్రియను 19,20 శతాబ్దాలకు చెందిన అసమగ్ర రసాయనిక భౌతిక సిద్ధాంతాల దృష్ట్యా నిర్వచించడం తొందరపాటే కాగలదు".

అణువులు ఉద్దేశ్యము, లక్ష్యము అనే ధర్మాలు లేని జడాలు. కాని మనం జీవితానికి విలువనిస్తాము. సాటి జీవులపట్ల, వ్యక్తుల పట్ల ప్రేమాభిమానాలుంటాయి. ఇట్టి లక్ష్యం, అవగాహన లేకుండా జీవితపు విలువలే వుండజాలవు. కాని జీవము కేవలం రసాయనిక ప్రక్రియేనని చెప్పే ఆధునిక శాస్త్రం జీవధర్మాలైన ఈ విలువలను వివరించలేదు. కాని అవి మననిత్యానుభవం.

అణువుల మధ్య పనిచేసే ఆకర్షణ వికర్షణ సమగ్రరూపమే అయిన మానవుడు సుఖదుఃఖాల గురించి చింతించడ మేమిటి? నైతిక విలువలను గురించి ఆలోచించడమేమిటి? విద్యాసంస్థల నేర్పరచడం ఎందుకు అతడికవసరంకావాలి? వివిధ రంగాలలో శాస్త్రజ్ఞులు పరిశోధించడం, తెలుసుకోవడానికి ప్రయత్నించడం, చర్చించడం, ప్రయోగాలు చేయడం ఇవన్నీ ఎందుకు? మానవజాతి జడమైన అణువుల సముదాయం మాత్రమే అయితే ఇట్టి పనులెలా సాధ్యం? కాని శాస్త్రజ్ఞులు జీవపదార్థమలానే యేర్పడిందని తలుస్తున్నారు. నిజానికి జీవకణం గురించి సంపూర్ణ విజ్ఞానం కూడా మనకు లభించలేదు. ఒక జీవకణంలో షుమారు 200 ట్రిలియన్ల అణువులున్నాయన్నీ, అందులో ప్రతిఒక్కటి కొన్ని వేల ప్రతిక్రియలను వెంట్రుకవాసి తేడా లేకుండా సకాలంలో తగుమాత్రంగా నిర్వహిస్తుందని అంచనా వేయబడింది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

ఆ ప్రక్రియలను తారుమారుచేసే విధంగా అవి పనిచేసే అవకాశమున్నా అలా చెయ్యక నియమబద్ధంగా పనిచేస్తాయి!

ఇలాగ జీవకణం ఒక ప్రత్యేకమైన పద్ధతిగల ప్రతిక్రియలను మాత్రమే కొనసాగించేలా చూచేదేమిటి? అణువుల స్థాయిలోకూడా ఇలాగ సచేతనమైన క్రియలను నడిపించగల రసాయనిక సూత్రాలేమిటి? వీటిని వివరించగల తరంగ సమీకరణాలేవి? ఆ సిద్ధాంతాన్ని ప్రయోగాత్మకంగా నిరూపించనిదే అణుక్రమ పరిణామ సిద్ధాంతం నిజమని ఎలాతలచడం. DNA మొదలుగాగల అణువులన్నీ జీవశక్తి ఆదేశించిన ప్రకారమే పనిచేయగల పరికరాలు మాత్రమే. అవే జీవమనడానికి వీలులేదు. అంతేకాదు, ఒక్కొక్కప్పుడు చిత్రమైన మానసిక క్రియలు అకారణంగా జరుగుతుంటాయి. ప్రఖ్యాత సంగీతకారుడు 'మొజర్ట్' (Mozart) ఇలా అంటారు.

"నామనస్సు బాగున్నప్పుడు కోరినవెంటనే ఎన్నో యోచనలు వస్తాయి. అవెలా ఎక్కడనుంచి వస్తాయి.......... ఒక కళాఖండం పూర్తి కాగానే దానికి సంబంధించినది యింకొకటి వస్తుంది. కాని సరిగా మిగిలిన వాటికంతటికీ సరిపోయేదే వస్తుంది.......... అపుడు నాఆత్మ ఉత్తేజిత మవుతుంది.......... అది ఒక అంశం తర్వాత మరొక అంశంగా రాదు, అది సంపూర్ణంగా దర్శనమవుతూ వుంటే నేను వినడం మాత్రమే జరిగేది".

అతని మెదడులో జరిగే ఇటువంటి ప్రకృతిక్రియలు కేవలం జడమైన కణాలమధ్య జరిగే ప్రతిక్రియల ఫలితాలు మాత్రమే కాజాలవు. అతని మెదడులో సంగీతాన్నుద్భవింపజేసే కూర్పు భౌతికశాస్త్ర సూత్రాలననుసరించి మాత్రమే సుదీర్ఘ కాలంలో దానికదే ఏర్పడిందనడానికి ఆస్కారం లేదు. క్వాంటమ్ యాంత్రిక సమీకరణంతో, రెండు పరమాణువు మాత్రమేగల ఉదజని అణువులోని సామ్యస్థితిని నిర్వచించడమే బహుకష్టం. బృహత్తరము, సంకీర్ణము అయిన జీవరసాయనిక అణువుల స్థితిని శాస్త్రీయంగా నిర్వచించడం అనూహ్యం.

లండన్ విశ్వవిద్యాలయాలలో భౌతికశాస్త్ర పరిశోధనలు చేస్తున్న ఫ్రిట్జఫ్ కాప్రా (Fr ti of Capra) ప్రాచ్య ఆధ్యాత్మిక గ్రంథాలను పరిశీలించి వాటిలో నిర్వచించబడిన సృష్టి తత్త్వం ఆధునిక శాస్త్రీయ విశ్వదృష్టిని సంపూర్ణంగా పోలివుందని గుర్తించారు.

Note: This book contains printing mistakes in the sanskrit verses

ఈ విషయాన్నిక్కడ పరిశీలిద్దాము మనకు వేరుగాతోచే శూన్యాకాశము, కాలము సాపేక్షిక సిద్ధాంతంలో ఒక్కటే. నాలుగు నిరుపకాలు గల దేశకాలము (Space Time) వీటిని సాపేక్షిక సిద్ధాంతం ద్వారా కానీ లేక తక్కువ నిరూపకాల నుండి ఎక్కువ నిరూపకాల స్థాయికి మన అవగాహనను మరలించడంవలన గానీ ఈ ద్వంద్వాల ఐక్యతను సాధించవచ్చు. సామాన్యానుభూతికి మూడు నిరూపకాలు మాత్రమే గోచరించడం వలన సృష్టిలో వైవిధ్యం గోచరిస్తుందనీ, ఎక్కువ నిరూపకాలస్థాయిలో ఐక్యత మాత్రమే వుండగలదనీ నేటి భౌతిక గణిత శాస్త్రాలు గుర్తిస్తున్నాయి. ఆధ్యాత్మ విద్యలో ధ్యానానుభూతి యిట్టి ఐక్యతను తెలియజేస్తుంది. అంటే మన ఎరుక మూడు నిరూపకాలకు అతీతమైన సాయిలో పనిచేయడమే ధ్యానమన్నమాట. నేటి భౌతికశాస్త్రం 'పదార్థము-శక్తి', 'కణాలు-తరంగాలు', 'చలనము-నిశ్చలత', 'ఉండుట-లేకుండుట' మొదలైన ద్వంద్వ భావాలనతిక్రమిస్తుంది.

ఈవిషయమే అతిసూక్ష్మమైన కణాల స్థాయిలో కూడా నిరూపించబడుతుంది. సాంప్రదాయిక క్షేత్రసిద్ధాంతము, విద్యుచ్ఛలన శాస్త్రము, క్వాంటమ్ సిద్ధాంతము, సాపేక్షిక సిద్ధాంతాలను సమన్వయపరచి క్వాంటమ్ విద్యుత్క్రియాశాస్త్రంగా రూపొందించారు. ఇది సూక్ష్మకణాలమధ్య జరిగే విద్యుదయస్కాంత శక్తి తరంగాల వ్యక్తరూపాలే కణాలనీ, ఈ తరంగాలు స్పందనాత్మకమైన క్షేత్రాలనీ, ఈ క్షేత్రాలు క్వాంటాలుగా కూడా ప్రకటం కాగలవనీ ఈ శాస్త్రం చెబుతుంది. అంటే ఒక్కొక్క సూక్ష్మకణం ఒక రకమైన శక్తిక్షేత్రానికి సంబంధించినదన్నమాట. సాంప్రదాయికంగా ఘనమైనవిగా తలచబడ్డ కణాలకు, వాటికీ వాటిచుట్టూ వుండే శూన్య ఆకాశానికి గల భేదాన్ని ఈ క్వాంటమ్ క్షేత్ర సిద్ధాంతాలు రద్దు చేశాయన్నమాట. ఈ క్వాంటమ్ క్షేత్రమే ప్రాథమికమైన భౌతిక అంశంగా నేడు తలచబడుతూంది. ఈ క్షేత్రం శూన్యాకాశ మంతటా వ్యాపించి వుంటుంది. దీనియొక్క స్థానిక కూటములే కణాలు — ఒకప్పుడుత్పన్నమై తిరిగి క్షేత్రంలో లయిస్తూంటాయి.

'ఐన్‌స్టీన్' యిలా అంటారు, "పదార్థం శూన్యాకాశంలో కొన్ని స్థానాలలో అతి తీవ్రమైన క్షేత్ర కూటములచేత చేయబడి వుంటుంది............ ఈ నూతన భౌతిక శాస్త్రంలో క్షేత్రము, పదార్థము అని రెండులేవు. క్షేత్రమొక్కటే వాస్తవం.

ప్రాచ్య అధ్యాత్మవేత్తలు చెప్పిన ఈ సత్యము అవాఙ్మానస గోచరము. క్వాంటమ్ సిద్ధాంతం బుద్ధిగోచరము. ఇది కొన్ని భౌతిక ప్రకృతి క్రియలను మాత్రమే వివరిస్తుంది. కానీ ఆధ్యాత్మిక సత్యం సర్వవస్తువుల నిజతత్త్వాన్ని చెబుతుంది.

"హిందువులు చెప్పిన బ్రహ్మము, బౌద్ధులు చెప్పిన ధర్మకాయము, తావో మతస్తులు చెప్పిన 'తావో' అను మూలతత్త్వమే ఈ సమగ్రక్షేత్రసిద్ధాంతం కావచ్చు. అది భౌతిక శాస్త్రంలో పరిశోధించబడే ప్రకృతి క్రియలనే గాక తదితరమైన అన్నింటినీగూడా వివరించగలగవచ్చు" అంటారు కాప్రా.

ఈసృష్టి తాండవమనే రూపకాలంకారం హిందుమతంలో వర్ణించబడ్డ శివతాండవంలో గంభీరము, సుందరము అయిన విధంగా చెప్పబడింది. శివుడు నటరాజు. సర్వప్రాణుల జీవితమంతా జనన మరణాలు, సృష్టిలయాలు అను తాళబద్ధమైన శివతాండవ పర్యవసానమే. ఈ విషయాన్ని తత్త్వవేత్త కళాకారుడు ఆనందకుమారస్వామి యిలా వివరిస్తారు:

"బ్రహ్మము రాత్రిననుభవించినప్పుడు ప్రకృతి అచేతనంగా వుంటుంది. శివుడుసంకల్పించేంతవరకూ ఆమె నృత్యం చేయజాలదు. ఆయన ఆత్మానందం నుండి మేల్కొని తన నృత్యంద్వారాజడ ప్రకృతిని మేల్కొల్పే శబ్దం దానియందంతటా చేస్తాడు. వెంటనే పదార్థం నృత్యం చేస్తూవుంటే ఆయనచుట్టూ వలయంవలె కాంతి ప్రకటమవుతుంది".

"ఆయన నృత్యం వలన దానిలోని వివిధ ప్రకృతి క్రియలను కొనసాగిస్తారు. కాలాంతరమున ఆయన తన నృత్యం ద్వారానే నామరూపాలనన్నింటినీ నశింపజేసి ప్రకృతికి విశ్రాంతి నిస్తారు. ఈవర్ణన కవిత్వం మాత్రమేకాదు; ఆధునిక విజ్ఞానంకూడాను. అంటే శివతాండవము బ్రహ్మాండాల సృష్టిలయాలకే గాక నిత్యమూ కొనసాగే జననమరణాలవంటి ప్రకృతి క్రియలకు సైతం సంకేతం. అంతేగాక మనకు వివిధ రూపాలుగా గోచరించేదంతా తత్త్వతః అనిత్యమూ, భ్రాంతి మాత్రమేనని శివుడు

హెచ్చరిస్తాడు. ఆయన భంగిమలలో ఢమరుకమును పట్టుకొన్న హస్తం సృష్టికాధారమైన శబ్దాన్నీ, ఎడమ చేతిలోని అగ్ని వినాశాన్నీ సూచిస్తాయి. ఆ రెండు చేతులూ ఒకేరీతిగా వుండడం వలన సృష్టి వినాశాలు ఈ ప్రపంచంలో సమంగా ఎల్లప్పుడూ కొనసాగుతుంటాయని సూచిస్తాయి. ఈ రెండు బాహువులకు నడుమనున్న నిర్వికారమైన ఆయన ముఖం ఈ రెండింటినీ సమన్వయించుకొన్న అతీతస్థితిని సూచిస్తుంది. కుడి ప్రక్క ఉన్న రెండవ బాహువు అభయముద్ర ద్వారా స్థితి, పాలనలను సూచిస్తుంది. ఎడమ ప్రక్కనున్న రెండవ బాహువు పైకెత్తబడిన ఆయన పాదాన్ని చూపుతూ మాయాజాలం నుండి విముక్తినిసూచిస్తుంది. నటరాజు రాక్షసుని దేహంపై నృత్యం చేస్తుంటారు. ఈ రాక్షసుడు మానవుని అజ్ఞానం; దీనిని నశింపజేయడం వలననే ముక్తిసాధ్యం. శివుడు పరబ్రహ్మ స్వరూపి గనుక సర్వరూపాలూ ఆయనవే. తాండవం చేసే యీ విశ్వమే శివుడు. ఆధునిక భౌతిక శాస్త్రం చెప్పినట్లు ఈ తాండవం నిత్యమూ జరిగేదే" అంటారు కాప్రా.

వివరించడానికి అతి జఠిలమైన 'S. Batrix' మొదలైన సిద్ధాంతాలను సమీక్షించి కాప్రా వాటి పర్యవసానాన్నిలా చెబుతారు.

"పరమాణువు కంటే సూక్ష్మమైన కణాలనుగూర్చి చెప్పే యీ సిద్ధాంతంలో గమనింపబడు ప్రకృతి క్రియలనుండి పరిశీలకుని విడదీయడమసంభవమని క్వాంటమ్ సిద్ధాంతంలో కంటే గూడా సంపూర్ణంగా నిరూపించబడుతుంది. చివరికి ప్రకృతిలో మనకు గోచరించే నిర్మాణాలు, ప్రకృతి క్రియలన్నీ వాటినర్థం చేసుకొని కొలవడంలో మన మనస్సు రూపొందించుకొన్నవి మాత్రమే.......... ప్రాచ్య ఆధ్యాత్మికవేత్తలు గూడా మనకు గోచరించే వస్తువులుసంఘటనలు మన చైతన్యస్థాయిననుసరించి మన మనస్సు నిర్మించుకున్న వేననీ, మనమట్టి చైతన్యస్థాయినతిక్రమించినప్పుడు అవి కూడా లేకుండా పోతాయనీ పదేపదే చెబుతారు".

"........యోచననీరీతిగా కొనసాగిస్తే ప్రకృతిలోని ఇతర అంశాలతోబాటు చైతన్యం కూడా వుంటూనే ప్రకృతి యిట్టి సామర్థ్యం గల స్వయంసంపూర్ణ తత్త్వంగా వుండగలదని బూటుతాడు సిద్ధాంతం సూచిస్తుంది" అని 'జొఫ్రేచ్యూ' (Geoffrey Chew) అంటారు. ఆ భావంకూడా అధ్యాత్మవిద్య కెంతగానో సరిపోతుంది.

ప్రాచ్యఆధ్యాత్మిక గ్రంథాలన్నీ సృష్టికి కారణమైన తత్త్వం చైతన్యం గలదనీ, తిరిగి తిరిగి నామరూపాత్మక మైనజగత్తునుత్పన్నం చేయడంలో తనను తానే సంపూర్ణప్రజ్ఞతో అది గుర్తించగలుగు తుందని చెబుతాయి.

ఈ విధంగా నేటి శాస్త్రజ్ఞులు జీవపదార్థానికీ తత్ప్రక్రియలకూ ఆధారమైనటు వంటిది, మనకు అంతుపట్టనిది ఒక కీలకమైనశక్తి యేదో వున్నదన్న నిర్ధారణకు వచ్చారు. కాబట్టి సృష్టిక్రియంతా జటిలమైన ప్రక్రియలతో కూడియుండికూడా ఒక క్రమమార్గాన్ననుసరించి కొనసాగడానికి ఆధారమైన శక్తిని ఋషులు 'చైతన్యం' అని మన శాస్త్రాలో చెప్పారు. ఆ సత్యాన్నే నేటి శాస్త్రజ్ఞులు ధృవపరచారన్న మాట.

ఈ చైతన్యమే లేదని తలచినట్లైతే పురుషసూక్తానికసలు అర్థమే లేకుండా పోతుంది. అంతేగాక ఇట్టి జటిలములైన కూర్పులతో కూడివున్న ఈ జగత్తు, అందులోని జీవపదార్థం, జీవులు, మానవులు, అట్టి మానవుని మనస్సు, దానిలోని భావాలూ, మంచీ, చెడూ, యోచనాశక్తి-ఇవన్నీ ఏర్పడి వుండటానికెటువంటి అవకాశమూ లేదు.

ప్రఖ్యాత భౌతికశాస్త్రవేత్త అయిన ఎర్విన్ ష్రోడింజర్ 'మనస్సు-పదార్థము' అన్న గ్రంథంలో పదార్థానికాధారమైన చైతన్యాన్ని గురించి ఇలా వివరిస్తారు.

ప్రపంచమనబడేది యింద్రియానుభూతుల, స్మృతుల నిర్మాణము. దానిని స్వతస్సిద్ధమైన ఉనికిగల వస్తువుగా పరిగణించడం ఒక సౌలభ్యం మాత్రమే. కాని అది దానియొక్క ఉనికివల్ల మాత్రమే మనకు వ్యక్తం కాదనీ నిశ్చయంగా చెప్పవచ్చు; అది మనకు వ్యక్తం కావడం ఈ ప్రపంచంలోని ప్రత్యేకమైన భాగాలలో జరిగే ప్రత్యేకమైన క్రియలపై ఆధారపడివున్నది. సృష్టిలోని ఈ ప్రత్యేకమైన భాగాన్నే 'మెదడు' అంటాము. అప్పుడు ఈ మెదడులో జరిగే ప్రతిక్రియల ప్రత్యేక ధర్మాలెట్టివి? అవి యే విధంగా ఈ సృష్టిని వ్యక్తం చేస్తాయి? అన్న ప్రశ్న ఉత్పతన్నమవుతుంది.

చైతన్యమనేది కొన్నినరాల క్రియలకు సంబంధించినది మాత్రమేనని, అంతకుమించి చైతన్యమన్నది ఊహాగానం మాత్రమేననీ, నిజమైన జ్ఞానానికది నిరుపయోగమనిహేతువాది తలుస్తాడు. ఇదే నిజమైతే మెదడులోని నరాల క్రియలన్నీ మన ఎఱుకతో జరిగేవి మాత్రమే కావాలి. కాని నరాలలోను, మెదడులోను జరిగే

క్రియలన్నీ చైతన్యానుభూతిని కలిగించవు. కానీ జీవశాస్త్రపరంగాను శారీరకశాస్త్ర పరంగాను చెప్పాలంటే ఇవన్నీ చైతన్యవంతమైన ప్రక్రియలను పోలివుంటాయి. యాంత్రిక ప్రతిక్రియలలో ఎక్కువ భాగం మెదడుగుండా పోతాయి గాని చైతన్యానికి గుర్తింపుకానేకావు. ఉదాహరణకు శ్వాస సామాన్యంగా సంకల్ప రహితంగానే జరిగిపోతుంది.

మనభౌతిక జగత్తులో చైతన్యం స్వతస్సిద్ధమైన తత్త్వం కాదనడానికి కారణమున్నది. మనం చుట్టూవుండేప్రకృతి సామ్రాజ్యాన్నర్థం చేసుకోవడంలో దానిని గుర్తించే మన వ్యక్తిగత చైతన్యాన్ని దానినుండి మనకు తెలియకనే బహిష్కరిస్తాము. ఇలా ఎందుకు జరుగుతుందో చూద్దాము.

1. నా మానసిక క్రియలన్నీ ప్రత్యక్షంగాను, సన్నిహితంగాను నా శరీరంతో సంబంధపడి వుంటాయి. అది నా ఇంద్రియానుభూతుల నుండి స్మృతులనుండి నేను నిర్మించుకునే విజ్ఞాన విషయమైన నా చుట్టూ జగత్తులోని భాగమై వుంటుంది.

2. ఇతరులదేహాలు కూడా ఇటువంటి జగత్తులో భాగమై వుంటాయి. ఈ ఇతర శరీరాలు కూడా చైతన్యానికి నివాసాలని నమ్మడానికి చక్కని హేతువులున్నాయి. ఈ విధంగా పరుల చైతన్యాలు చుట్టూవున్న వాస్తవిక ప్రపంచంలో భాగమని తలచడానికి సంసిద్ధుడనై యుండి, వారికి సర్వవిధాల నాతో సమానమైన నిర్మాణం వుండటాన నేను కూడా నా చుట్టూవున్న వాస్తవికము భౌతికము అయిన ప్రపంచములోభాగమని నమ్ముతాను. అంటే నా సచేతనమైన వ్యక్తిత్వాన్ని నా అనుభవాలైన మానసికాంశాలతో నిర్మించబడిన ఆ ప్రపంచంలోనే, నేను ప్రవేశ పెడతాను.

శాస్త్రీయ పరిశోధనల వలన వాస్తవానికి జగత్తు ఎట్టి రంగులు, శబ్దాలు లేనిదనీ, అనాసక్తికరమైనదనీ తెలుసుకోగానే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. రంగు, శబ్దము, శీతోష్ణాలుఅనేవి మనకు ప్రత్యక్షానుభవాలు. ఇవి మన చైతన్యానుభూతులే. వాటిననుభవించే చైతన్యముండడంవల్లనే అవి ఉన్నట్లు అనుభవమవుతుంది. ఆ చైతన్యాన్ని అసత్యమని తలచి సృష్టితత్త్వాన్ని యోచిస్తే, అట్టి ధర్మాలేవీ లేనిదే జగత్తని

తేలుతుంది. వాటినుండి మనం నిర్మించుకున్న జగద్భావంనుండి మన చైతన్యాన్ని తొలగించినపుడు ఈ గుణాలు కూడా అందుండి తొలగుతాయి.

ఈ విషయాన్నే 'సి. జి. యూంగ్' అను శాస్త్రవేత్త యిలా అంటారు: "శాస్త్రమంతా మన ఆత్మయొుక్క క్రియ; విజ్ఞానమంతా అందులో నాటుకొనియున్నది. విశ్వంలోని అద్భుతాలన్నిటికంటె ఆత్మ మహత్తరమైనది. జగత్తునొక విషయంగా గుర్తించడానికి అది ప్రధానం. వాస్తవమలావుందని అరుదుగా ఎవరో తప్ప పాశ్చాత్య ప్రపంచంలో ఎవరూ గుర్తించకపోవడమెంతో ఆశ్చర్యం. మన గుర్తింపుకు గోచరించే బాహ్యవస్తువుల ప్రవాహం, వాటిని గుర్తించే యెరుకను నేపథ్యంలోకి నెట్టివేసి దానికి ఉనికి లేనట్లుగా చేసింది" (Eranous year book - 1946)

ప్రకృతి శాస్త్రజ్ఞుని చేత పరిశీలింపబడిన అన్యము, బాహ్యమూ అయిన ఈ ప్రపంచాన్ని మనస్సు తనలో తానే యేర్పరచుకొన్నది. కాని మనస్సు మనస్సుగా ఒక వాయిద్యాన్ని వాయించలేదు; మనస్సుగా ఒక చేతివ్రేలును కదిలింపజాలదు. ఏ పదార్థం నుంచైతే మన ప్రపంచభావం నిర్మించబడిందో, అట్టి మనస్సుకు సంపూర్ణంగా దాని అవయవాలైన జ్ఞానేంద్రియాల ద్వారా మాత్రమే లభిస్తుంది; కనుక ప్రతివ్యక్తి యొుక్క జగద్భావం అతని మనస్సుచేత నిర్మించబడినదియై వుంటుంది. మరొక రకమైన ఉనికి దానికి కలదని నిరూపించడం సాధ్యంకాదు. అయినప్పటికీ ఆ నిర్మాణంలో మనస్సుకెట్టి స్థానమూలేదు! ఈ విషయాన్ని మనం సామాన్యంగా గుర్తించలేము. కారణం ఒక వ్యక్తి లేక జంతువుయొుక్క వ్యక్తిత్వం దాని శరీరం లోపల వుంటుందని తలచడానికి సంపూర్ణంగా అలవాటు పడ్డాము. శారీరక శాస్త్రం ఎంత అభివృద్ధి చెందినప్పటికీ ఈ విషయం ప్రకృతి మనకర్థమయ్యేదిగా వుంటుందనే సూత్రానికి పూర్తిగా విరుద్ధం. జగత్తును చూచే వ్యక్తిత్వానికీ, చూడబడే వస్తువుకూ మధ్యగల ఈ 'సరిహద్దు' నిశితమైన సరిహద్దు కానేకాదని భౌతిక శాస్త్రంలో ఇటీవల కనుగొనబడిన విషయాలు ఋజువు చేస్తాయి. పరిశీలించబడే వస్తువును దానిని గమనించడానికి మనంచేసే యత్నంచేత మార్పు చేయకుండా మనమెప్పటికీ దానిని గుర్తించ లేకపోవడమే దానికి తార్కాణం.

నిత్యజీవిత వ్యవహారానికై గుర్తించేవాడు - గుర్తించబడేది అనే భేదాన్ని అంగీకరింపవలసి వచ్చినప్పటికీ తాత్విక యోచనతో దానిని పరిత్యజించి తీరవలసి

వుంటుంది. ఒకే అంశాలతోనే నా మనస్సు, ప్రపంచం కూర్చబడి వుంటాయి. స్వతస్సిద్ధంగావున్న జగత్తొకటి, దానిని గుర్తించే మనస్సులో అనుభవమైన జగత్తొకటి అని భౌతికవాది అంటాడు. కాని అదిసరికాదు. జగత్తనే అనుభవం మనకు ఒకటే లభ్యమవుతుంది. నేటి శాస్త్రానుభవం దృష్ట్యా కూడా ఆ పరిహద్దు లేనేలేదు.

అన్నింటినీ తెలుసుకొని గుర్తించే వ్యక్తి చైతన్యము మన శాస్త్రీయ ప్రపంచంలో ఎక్కడా కనిపించకపోవడానికి కారణం మనము జగత్తునర్థం చేసుకోవడంలోని లోపమే. మనకనుభవమయ్యే జగత్తంతా (అనగా యావజ్జగద్భావమూ) కలసి వ్యక్తి చైతన్యము, జగత్తు అనబడు అనుభవాల కూటమే మన మనస్సు. కనుక అదీ జగత్తులో ఒక భాగంగా గుర్తింపబడదు. బహుసంఖ్యలో చైతన్యాలున్నట్లు కనబడుతుంది గానీ మనకనుభమయ్యే ప్రపంచం ఒకటిగానే వుంటుంది. అందరిలో సమానంగా వుండే వ్యక్తి చైతన్యాలు ఒకదానితో ఒకటి కలసే అంశమే మన చుట్టూవున్న జగత్తు అని పిలువబడే అనుభవాల కూర్పు.

ఇలా చెప్పినప్పటికీ కొన్ని క్లిష్టమైన ప్రశ్నలు తలెత్తుతాయి. నా కనుభవమయ్యే జగత్తే వాస్తవంగా నీకు అనుభవమౌతుందా? మనందరి వ్యక్తి చైతన్యాలలోనూ జగద్భావాలుగా అందించబడే చిత్రాలకు భిన్నంగా వాస్తవమైన జగత్తొకటి వున్నదా? అట్టిది వుంటే మనమేర్పరచుకున్న చిత్రాలను పోలివుంటుందా?

వ్యక్తిగత చైతన్యాలువాస్తవానికి ఏకత్వాన్ని కలిగివున్నాయి. మనకు కనిపించే మనస్సు యొక్క నానాత్వము కేవలం భ్రాంతి మాత్రమేనని తలచవచ్చు. ఉపనిషత్తులు బోధించేది ఈ విషయాన్నే, పర్షియాదేశంలో 13వ శతాబ్దికి చెందిన "అజీజ్ నసఫీ" అను ముస్లిమ్ మహాత్ముడు ఇలా చెప్పారు :

"ఏకాత్మకమైన ఆధ్యాత్మిక జగత్తంతా భౌతిక ప్రపంచము వెనుక జ్యోతి వలెన నిలిచి వుంటుంది. భౌతిక ప్రపంచంలో ఒక జీవి ఉద్భవించినప్పుడు కిటికీల నుండి వెలుతురు లోపలకు వచ్చినట్లు ఆ జీవిద్వారా ఈ ఏకాత్మే ప్రకటమౌతుంది. కిటికీ యొక్క తత్వాన్ని, పరిమాణాన్ని బట్టి కాంతి ఎక్కువగానో తక్కువగానో లోపలికి ప్రవేశించినట్లు, ఆ జీవియొక్క తత్వాన్నిబట్టి ఆ జ్యోతివంటి ఏకాత్మ తగురీతిన దానిద్వారా వెల్లడవుతుంది. కిటికీలలో మార్పున్నప్పటికీ వాటిద్వారా ప్రవేశించే

వెలుతురులో మార్పులేనట్లు జీవులమధ్య వైవిధ్యమున్నప్పటికీ వాటిద్వారా వెల్లడయ్యే వెలుగుమాత్రమెల్లప్పుడూ ఒక్కటే".

ఆల్డస్‌హక్స్‌లీ (Aldous Huxley) సంకలనము చేసిన "The Perennial Philosphy" అన్న గ్రంథంలో ఇటువంటి చక్కటి వాక్యాలు ఎన్నో కనబడతాయి. వివిధ జాతులకు మతాలకు చెందినవారు చెప్పిన ఆ వాక్యాలు అద్భుతమైన ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చడం ఆశ్చర్యమే.

గ్రీకు నాగరికత నుండి ఉత్పన్నమయిన నేటి శాస్త్రీయ దృక్పథము జగత్తు మననుండి అన్యమన్న భావంమీద ఆధారపడడమేగాక దానిని అవగాహన చేసుకొనే చైతన్యంతో ఎట్టి సంబంధమూ లేకుండా యేర్పడింది. సరిగ్గా ఈ విషయంలోనే నేటి మన యోచనా రీతిని సవరించుకోవలసి వుంటుంది" అంటారు ష్రోడింజర్.

అన్ని మనసులూ ఏకత్వాన్ని కలిగి వున్నాయని చెప్పే ఆధ్యాత్మిక తత్వానికి అనుకూలమయిన ఒక వాస్తవాన్ని అంగీకరించక తప్పదు. చైతన్య మెప్పుడూ ఏకవచనాత్మకమైన అనుభవమే. ఎవడైనా ఎప్పుడైనా చైతన్యముయొక్క ఏకత్వాన్ని మాత్రమే ప్రత్యక్షంగా అనుభవిస్తాడు. ప్రపంచంలో ఎప్పుడూ ఎక్కడా ఎవ్వరూ మరో విధంగా చైతన్యాన్ననుభవించినట్లు మనమూహించను కూడా లేము.

రెండు భిన్నమైన వ్యక్తిత్వాలను ప్రకటించే మానసిక రోగులకు కూడా తడవకు ఒక వ్యక్తిత్వము మాత్రం ప్రకటమౌతుంది. అందులో ఒక వ్యక్తిత్వానికి రెండవ వ్యక్తిత్వానికీ ఎట్టి సంబంధమూ వుండదు.

నాకు ఒక్కటిగా అనుభవమయ్యే నా చైతన్యం నా శరీరంలోని జీవకణాల వివిధ చైతన్యాల సమన్వయం నుండి ఎలా ఏర్పడిందో నన్నది నా అవగాహనకు అందడం లేదు. కనుక నా చైతన్యం వివిధ జీవకణాల ప్రక్రియల ఫలితాము మాత్రమేనని తలచడం అసంభవమనిపిస్తుంది. హేతుబద్ధంగా ఆలోచిస్తే ఈ జీవకణాల నానాత్వం వలన నాకు చైతన్య బాహుళ్యం అనుభవం కావాలి.

సర్ ఛార్లెస్ షెర్రింగ్‌టన్ (Sir Charles Sherrington) అను మేధావి, శాస్త్రవేత్త యిలా అంటారు: "మన శరీరంలో వుండే వివిధ జీవకణాలలో ప్రతిఒక్కటీ

స్వతంత్రమైన జీవియని చెప్పవలసి వుంటుంది. ప్రతిజీవకణము తక్కిన జీవకణాలనుండి భిన్నమయిన ఆకృతి కలిగి తన జీవితానికవసరమైన కేంద్రము తనలోనే కలిగి వున్నదని చెప్పవలసివుంటుంది. ఒక్కటిగా అనుభవమయ్యే మన వ్యక్తిగత జీవితమంతా సంపూర్ణంగా అట్టి సృష్టి జీవకణాల జీవిత సంపుటిమాత్రమే (Mon on his Nature -పుట 73 First Edition 1940)

నేటి పరిశోధన ప్రకారం మెదడులోని వివిధ భాగాలు వివిధ జ్ఞానేంద్రియాల క్రియలకు కేటాయింపబడి స్వతంత్రంగా పనిచేస్తాయి. దీనినిబట్టి సహజంగా మనస్సులో కూడా స్వతంత్రమైన అనేక విభాగాలు, ఆయా జ్ఞానేంద్రియాలకు సంబంధించినవి అనుభవం కావాలి. కాని మన నిత్యానుభవంలో అలా జరుగకపోవడం చాలా చిత్రం.

షెర్రింగ్‌టన్ ఇలా చెబుతారు : "రెండు కన్నులనుండీ విడివిడిగా వచ్చే అనుభవాలను గుర్తించే కేంద్రకాలు మెదడులో ఒకే స్థానంలో వుండవు. ఒక్కొక్క కంటికి కలిగిన అనుభవాలకు అనుగుణమైన మానసిక క్రియలు ప్రత్యేకంగా జరుగుతాయి. ఆ రెండింటి క్రియలు ఒకేసారి జరగడం వలన రెండు కన్నులకు కలిగే అనుభవాలకూ ఏకత్వము సిద్ధిస్తుంది. కాని అట్టి ఏకత్వానికి అవసరమైన నిర్మాణము మెదడులో ఎట్టిదీ వుండదు.

మెదడు యొక్క ఊర్ధ్వభాగంలో ఐదు జ్ఞానేంద్రియాలకు సంబంధించిన కేంద్రాలు వివిధ స్థానాలలో స్పష్టముగ విభజింపబడి వుంటాయి. అంటే వివిధ జ్ఞానేంద్రియాలకు సంబంధించిన ఉపమనస్సుల ప్రక్రియలు ఏకకాలంలో జరగడం వలన పరస్పరం సమన్వయ పడిన ఏకరూపమా మనస్సు? వాస్తవానికి నాడీవ్యవస్థ వ్యక్తిత్వం గల కోటానుకోట్ల జీవకణాలతో పనిచేసే ప్రజాస్వామ్యమని చెప్పాలి. కాని మనస్సులో ఈ నానాత్వమే గోచరించదు. అనేక జీవకణాలతో చేయబడిన మెదడుకు బదులు ఒకే మెదడు కణము మనలో వున్నప్పటికీ అది మనస్సుయొక్క ఏకత్వానుభూతికి కారణం కాజాలదు. పదార్థాలు శక్తి కణాలతో చేయబడివుంటాయి. జీవపదార్థమూ అంతే. మనస్సు మాత్రం అలా కాదు.

ఒక్కటిగా అనుభవమయ్యే మనస్సు అనేకమైన జీవకణాల యొక్క జీవితాలను ఆధారము చేసుకొన్నది. మరొక విధంగా చెప్పాలంటే ఒక్కొక్క దానికి ఒక్కొక్క మనస్సుండడానికి తగిన వ్యవస్థ ఉన్నది. అట్టి అనేక ఉపమెదడులే ఒక్క మనస్సుకు ఆధారము. కానీ ఎప్పుడూ ఎవ్వరికీ మనస్సు అనేక భాగాలు కలదిగా, అనేకత్వం కలదిగా అనుభవంకాదు.

"కనుక మనస్సు తత్వతః ఏకమే. మొత్తంమీద మనస్సుల సంఖ్య ఒక్కటేనని చెప్పితీరవలసి వుంటుంది. ఎవరైనా నేను చెబుతూన్నది మతమనీ, సైన్సుకాదనీ అనేట్లయితే నేనంగీకరిస్తాను. కానీ ఈ మతం సైన్సుకు విరుద్ధమైనదికాదు. నిష్పాక్షికమైన శాస్త్రీయ పరిశోధన యే సత్యాలను కనుగొన్నదో వాటిచే బలపరచబడిన మతమే నేను చెప్పేది" అంటారు ష్రోడింజర్.

షెర్రింగ్‌టన్ అంటారు : "మానవుని మనస్సు భూమియొక్క తలంమీద స్వల్పకాలం క్రిందట ఏర్పడినది" అని.

ఇది సత్యమేకాని 'మానవుని' అను మొట్టమెదటి మాటను తొలగిస్తే ఆ వాక్యంతో ఏకీభవించలేము. జగత్తును గుర్తించే యెరుకగల మనస్సు ఆ జగత్తు ఆవిర్భవించడంలో ఒక దశలో మాత్రమే యేర్పడినదని తలచడం అర్థరహితంగా వుంటుంది. ఈ జగత్తుయొక్క ఉనికి అందరిలోవున్న ఏ చైతన్యం యొక్క అనుభూతిగా మాత్రమే వాస్తవమౌతున్నదో ఆ చైతన్యం ఒకప్పుడు లేదని. దానికంటే పూర్వంనుండీ జగత్తున్నదనీ చెప్పడం హాస్యాస్పదము, అర్థరహితము. వాస్తవానికి ఒక ప్రాథమిక చైతన్యం ఆ పదార్థాలను ఆ రీతిన జీవుల రూపంలో కూర్చిందనీ, అ జీవులు తమ జీవితాలను సంరక్షించుకొంటూండేందుకు దోహదం అయిందనీ, అందువల్లనే ప్రత్యేకమైన మెదడంటూ ఒకటి లేకుండానే మనకు పూర్వం ఎంతోకాలంనుంచీ వున్న జీవులు తమ జీవితాలను కొనసాగించుకొన్నాయనీ చెప్పవలసివుంటుంది. "అసంఖ్యాకమైన ఆ జీవజాతుల్లో కొన్ని మాత్రమే మెదడు అనే ప్రత్యేకమైన అవయవాన్ని పరిణామం ద్వారా రూపొందించు కోవడానికుపక్రమించే ముందు ఈ

సృష్టి ప్రేక్షకులులేని ప్రదర్శనగా తలచడమెలాసాధ్యం" అంటారు ష్రోడింజర్. అట్టి స్థితిని ఊహించే చైతన్యమే లేనప్పుడు ఆ మాట మాత్రం ఎలా చెబుతాము? మన నిత్యానుభవంలో ముందుగా ఒక జగత్తంటూవుంది, ఆ తరువాత అది మన చైతన్యంలో ప్రతిబింబించటం జరుగదు. ఒకేసారి మన చైతన్యంతోబాటు జగత్తు యొక్క ఉనికి కూడా అనుభవమౌతుంది. కనుక ప్రతిబింబించడం అనేమాట వాస్తవంకాదు. సరిగా చెప్పాలంటే జగత్తనే బింబము, జగద్భావమనే ప్రతిబింబమూ వేరుగా ఎక్కడా గోచరించవు. ఆ రెండు ఒక్కటే. ఆకాశంలోనూ కాలంలోనూ వ్యాపించి జగత్తున్నదన్నది మన అనుభూతిని మన యోచనలనూ చెప్పే విధానం మాత్రమే. బర్కిలీ (Berkely) అను తత్త్వవేత్త చెప్పినట్లు మన అనుభవానికి అన్యంగా జగత్తు, కాలము, ఆకాశము ఉన్నాయనడానికి వీలులేదు.

ఒక వంక యీ యావజ్జగత్ప్రక్రియా కొనసాగే ఏకైక రంగస్థలము మనస్సు. మరోలా చెప్పాలంటే ఈ జగత్ప్రక్రియను తనలో యిముడ్చుకున్న పాత్ర చైతన్యం. మరొక వంక ఈ జగత్తనే వ్యవస్థలో ఒక భాగమైన మెదడు అనే అవయవంతో సన్నిహిత సంబంధం గలది. అయినా జీవులు చైతన్యం కలిగి వుండటానికి మెదడు అను అవయం అత్యావశ్యకమని చెప్పడానికి వీలులేదు. కారణం ఇతర అవయవాలలాగే మెదడు గూడా ఆ ప్రాణుల జీవిత నిర్వహణకు అవసరమయ్యే పరికరము మాత్రమే. కొన్ని జీవులలో అది ఏర్పడకపోవడం కూడా వాటి జీవిత నిర్వహణకది అవసరం కాకపోవడం మాత్రమేగదా!

ఒక్కొక్క కవి తన కావ్యంలో ఒక అప్రధానమైన పాత్రగా తన ప్రతినిధిని ప్రవేశపెడతాడు. 'ఒడెసీ' కావ్యము వ్రాసిన కవి ఆ కావ్యంలో కన్పించే అంధుడైన కవిగా తనను ప్రవేశపెట్టుకున్నాడు. కల్పితమైన ఆ కవి రాజభవనంలో 'ట్రాయ్' (Troy) యుద్ధం గురించి గానంచేస్తూ ఆ యుద్ధంలో దెబ్బతిన్న కథానాయకునికి కళ్ళనీళ్ళు కారేలా చేస్తాడు.

Note: This book contains printing mistakes in the sanskrit verses

పైన చెప్పిన మనస్సు యొక్క రెండు దురవగాహమైన అంశాలకిది చక్కటి సారూప్యం. ఒక వంక సృష్టి మొత్తాన్ని కల్పించిన కళాకారుడు ఆ మనస్సే. కానీ ఆకళాఖండంలో అప్రధానమైన భాగం కూడా అదే అట్టి అప్రధానమైన పాత్ర లేకపోతే కళాఖండము రక్తి కట్టడానికి యే లోటూరాదు.

యావజ్జగత్తునూ సృష్టించినవిశ్వచైతన్యమే ప్రతివ్యక్తి చైతన్యంగా, కావ్యంలో రచయిత యొక్క ప్రతినిధియైన ఆ ప్రధాన పాత్రగా, మనకనుభవమౌతుంది. చైతన్యం యొక్క ఈ ద్వయీ భావాన్ని గుర్తించక వ్యక్తి చైతన్యం నశిస్తే జగత్తు నశించదు గనుక చైతన్యానుభూతి కన్యంగా జగత్తొకటి వున్నదని కొందరు భౌతిక వేత్తలంటారు. తద్వారా అధ్యాత్మ వాదాన్ని ఖండించగలిగామనుకుంటారు. విశ్వానికీ క్రమ పరిణామానికీ, వ్యక్తి జీవితానికీ యోచనకూ -- అన్నింటికీ చైతన్యం ఆధారమైయుండాలని నేటి విజ్ఞానశాస్త్రాలు సూచిస్తున్నాయి.

అన్నింటికీ ఆధారమైన చైతన్యం గురించి ధ్యానించేటప్పుడు అది అన్ని రూపాలలోనూ వున్నది ఒక్క చైతన్యమేనన్న భావనను స్థిరపరచుకొని తద్వారా భగవద్రూపాలైన అన్నింటిపట్ల రాగ ద్వేషాదులను విడిచిపెట్టడానికి మార్గమౌతుంది. తరువాత జగద్రూపంలో వ్యక్తం కాకుండా సాక్షిభూతంగా వుండే చైతన్యం లేక ఆదిపురుషుని ధ్యానించగలగటమే భగవద్గీతలో చెప్పబడినటువంటి నిజమైన పురుషోత్తమ ప్రాప్తి. అట్టివాడే పురుషోత్తముడు. ఆ ధ్యానం స్థిరపరచుకున్నవాడు తననుంచి ఈ జగత్తులో తననూ అనుభవపూర్వకంగా గుర్తిసాడు.



# ఆధ్యాత్మికానుభవము-ఆనందానుభూతి

మానవ జీవితం యొక్క ప్రధాన లక్ష్యం శాశ్వతమైన ఆనందాన్ని పొందటమే. దానినెలా పొందాలి? ఎలా నిలుపుకోవాలి? కోల్పోయినదాన్నెలా తిరిగి పొందటం? - ఇదే మానవుని తహతహ. ప్రాపంచిక విషయాల ద్వారా, వస్తువుల ద్వారా లభించే సంతోషము శాశ్వతమైనదికాదు. దుఃఖపూరితమైనది. సుఖదుఃఖాల కతీతమైన శాశ్వతమైన ఆనందమూ తృప్తి ఆధ్యాత్మికంగా మాత్రమే పొందడానికి అవకాశముంది.

మానవ జీవితంలో రెండంశాలున్నాయి. ఇంద్రియమనోదేహాలకూ, స్వార్థానికీ పరిమితమైన జీవితం ఒకటి. నిగూఢము, విశ్వాత్మకమూ అయినది రెండవది. మొదటిదానితోనే జీవితాన్నంతటినీ గడిపే మానవుడు భయానికీ, దుఃఖానికీ, నిస్పృహకూగురియై జీవిత పరమార్థాన్ని గుర్తించలేక వ్యర్థంగా జీవించి నశించడమే కాకుండా కాలుష్యానికి కారణమయిన వాడవుతాడు.

ఈ విషయం గురించి ఆర్. డబ్ల్యు. ట్రైన్ (R.W. Trine) అను శాస్త్రవేత్త ఇలా అంటారు :

"సర్వానికీ అధారము, అనంతమూ అయిన జీవశక్తే దైవ మంటాను............ ఆయన మన జీవానికి జీవం, ఆయన మన ప్రాణమే, మనమంతా ఆయన జీవశక్తిని పంచుకుంటాము. పరిమితమైన వ్యక్తులుగా రూపొందిన మనం ఆయనయొక్క అనంతమైన ఆత్మ శక్తియే. ఇంతకుమించి మనకూ దైవానికీ భేదం లేదు. ఈ వాస్తవాన్ని మనమెంత యదార్థంగా దర్శిస్తే అంతగా అనంతమైన ప్రాణశక్తి మనలోంచి పనిచేస్తుంది".

భగవంతుడనబడే దివ్యశక్తి నుండి మనము భిన్నమనీ, మానవులొకరినుంచి ఒకరు భిన్నులన్న భావమే రాగానికీ, బలహీనతకూ, దుఃఖానికీ ప్రధానకారణం.

అస్తికభావంతో భౌతికంగాను, మానసికంగానూ కూడా మార్పు వస్తుందనడానికి ఎన్నో ఆధారాలున్నాయి. వాస్తవమైన ఆధ్యాత్మికానుభవం పొందినవారి జీవితాలు కూడా ఈ సిద్ధాంతానికి సరిపోయేవిగా వున్నాయి. ఇటువంటి అనుభవాల నెన్నింటినో 'విలియమ్ జేమ్స్' అను ప్రఖ్యాత తత్త్వవేత్త తన గ్రంథం (The Varieties of Religious Experience) లో విశదపరచారు.

Note: The book contains printing mistakes in the sanskrit verses

ఒక వ్యక్తి అనుభవాన్ని 'విలియమ్ జేమ్స్' ఈ విధంగా ఉటంకిస్తారు.

స్టీఫన్ బ్రాడ్లే నిరక్షరాస్యుడు. తన 14వ యేట ఒక క్షణ కాలం ఏసు దర్శనాన్ని తనగదిలో పొందాడు. "ఆ సంతోషంలో వణికిపోయాను. ఆ తరువాత కూడా ఆ సంతోషం నాకెంతగా వుందంటే ......... నా కొచ్చిన అనుభవమే మానవజాతి కంతటికీ వస్తే బాగుండుననిపించింది." అటు తరువాత అతనికే మరొకసారి సామూహికంగా ప్రార్థిస్తూండగా దివ్యానుభూతి కలిగింది. అప్పటి తన స్థితిని యిలా వర్ణిస్తాడు : 'ఆ సంతోషం నా ఆత్మను పూర్తిగా స్వాధీనం చేసుకొంది. అట్టి ఆనందాన్ని నాకిక ప్రసాదించవద్దని. ప్రసాదిస్తే నేను తట్టుకోలేనని భగవంతుణ్ణి ప్రార్థించాను.' డేవిడ్ బ్రైనర్డ్ (David Brainerd) తన అనుభవాన్నీ క్రింది విధంగా వర్ణిస్తారు :

" ఆ దివ్యమైన కాంతి నన్ను సమ్మోహితుని చేసింది, ఆనంద పరచింది. నా వ్యక్తిత్వాన్నే కబళించింది. నేననే ఒక వ్యక్తిని వున్నానే సంగతి తోచలేదు.......... ఇటువంటి అంతరంగికమైన ఆనందం, శాంతి, ఆశ్చర్యాలలో రాత్రి చీకటి పడేదాకా వుండి పోయాను. అటు తరువాత ఈ దివ్యదర్శనాన్ని గూర్చి యోచించసాగాను. మరొరోజు సాయంత్రమంతాకూడా నా మనస్సు ఆ మధురమైన శాంతి ననుభవిస్తూనే వున్నది. నేనొక కొత్త ప్రపంచంలో వున్నట్లనిపించింది. నా చుట్టూ వున్న ప్రతి వస్తువూ ఎప్పటివలె కాక నూతనంగా కనిపించింది". ఇలాగే ఎంతోమంది అనుభవాలు తత్త్వవేత్తలైన 'ప్రాట్' యొక్క గ్రంథం (The Religious Consciousness) లోనూ 'క్లార్క్' యొక్క గ్రంథం (The Psychology of Religion) లోనూ చూడవచ్చు. ఇలాగే అన్ని మత గ్రంథాలనుండీ, మతస్థుల జీవితాలనుండీ దివ్యానుభూతులను పేర్కొనవచ్చు. అట్టి అనుభవాలకు గురియైన వ్యక్తుల శరీరంలోనూ, మనస్సులోనూ, నడవడిలోనూ శాశ్వతమైన మార్పులు రావడం గమనార్హం.

ఆరంభంలో అత్యంత నాస్తికులుగా జీవించి, అట్టి భావాలను ప్రచారం చేయడానికి జీవితాలను అంకితం చేసిన వారిలో కూడా కొందరు ఆధ్యాత్మికాను భూతికిక గురియై ఆస్తికులుగా మారారు. ఉదాహరణకు : ఆంధ్రదేశంలో నాస్తిక పితామహులుగా వెలసిన కీ॥ శే॥ త్రిపురనేని గోపీచంద్, గుడిపాటి వెంకటచలం, శ్రీ కె. సభాగార్లు కూడా చివరకు ఆస్తికులుగా మారి ఆధ్యాత్మిక విలువలను గుర్తించారు. శ్రీ త్రిపురనేని గోపీచంద్‌గారు శ్రీ శిరిడీ సాయిబాబా మహిమకులోనై తన కుమారునికి ఆ పేరే పెట్టారట. శ్రీ చలంగారు రమణమహర్షి ప్రభావానికి ఎలా గురియైనదీ మనకు తెలుసు. రమణాశ్రమ సమీపంలోనే స్థిరనివాసం యేర్పరచుకొని ఆస్మరణలోనే

Note: This book contains printing mistakes in the sanskrit verses

ఐక్యమయ్యారు చలం. శ్రీ సభాగారు తాము రమణ ప్రభావానికి ఎలా గురియైనదీ 'శ్రీరమణభగవాన్' అనే వ్యాసంలో ('ఆంధ్రప్రభ' సారస్వతానుబంధంలో) ప్రచురించారు. ఈ నాస్తిక పితామహులు యావజ్జీవితము అస్తికులకు వేసిన ప్రశ్నలు, చేసిన విమర్శలు ఆధ్యాత్మికానుభూతి అనే అగ్నిలో దగ్ధమైనాయి.

నిజానికి జగత్ప్రసిద్ధమైన మతాలన్నీ ఋషులు, బుద్ధుడు, యేసు, మహమ్మద్, గురునానక్ వంటి మూలపురుషుల దివ్యానుభవాల నాధారంగా చేసికొని ఆరంభమైనవే. అయితే ఈ దివ్యానుభూతియొక్క ముఖ్యలక్షణం 'సర్వమూ భగవన్మయము' అనే భావంలో 'నేను వేరు, జగత్తువేరు' అన్న పరిమిత మానసికదృష్టి లయించడమేనని గుర్తించవలసి వుంటుంది. ఇటువంటి దివ్యానుభవాలను పొందినవారి జీవితాలలో వచ్చే శాశ్వతమైన మార్పులను బట్టి మానజీవితంలో మతానికీ, ఆధ్యాత్మికతకూ గల విలువను గుర్తించవలసి వుంటుంది.

ఎంత క్లిష్టపరిస్థితిలోనైనా నిశ్చలత, ధైర్యము, శాంతి, ప్రేమలను, చెదరని స్థైర్యాన్ని ఈ ఆధ్యాత్మికానుభూతి ఇవ్వగలదని ఋజువుచేసి, మానవ.శ్రేయస్సుకోసం తమ జీవితాలను త్యాగం చేసిన ఆధ్యాత్మికవేత్తల జీవితాలను చరిత్రలోఎన్నైనా చూడవచ్చు.

ఆధ్యాత్మికానుభూతి కాధారమైన భగవద్భావన పురుషసూక్తంలో వివరంగా చెప్పబడివుంది. సకల చరాచర జగత్తు ఆది పురుషునిలోనుండి ఉద్భవించడం వివరంగా వర్ణించబడింది. పురుషసూక్తం కేవలం మంత్రయుక్తమైన స్వరంతో పారాయణ చేయడమే కాకుండా అందులోని అంతరార్థాన్ని మననం చేసుకుంటూ ఎప్పుడూ మన నిత్యజీవితంలో కూడా సర్వమూ భగవన్మయమన్న భావాన్ని నిలుపుకుని తద్వారా సర్వజీవులలోనూ భగత్స్వరూపాన్ని చూడగలగటమే నిజమైన పురుషసూక్త పారాయణ. ఆ మంత్రార్థాన్ని దర్శించటంలో పరాయణ చెందటమే పారాయణ.

ఈ జగత్తు యొక్క సమగ్ర స్వరూపం. సృష్టియొక్క క్రమం ఆదిపురుషుని తత్త్వం విశదంగా పురుషసూక్తంలో పొందుపరచబడివుంది.

కాబట్టి పురుషసూక్తం యొక్క అర్థాన్ని నిత్యం భావనచేస్తూ పారాయణ చేయడంవల్ల పైన వివరింపబడిన తదాత్మ్యస్థితి లేక భగవద్భావన అనుభవపూర్వకంగా తెలుసుకోవడం సాధ్యమవుతుంది.

Note: This book contains printing mistakes in the sanskrit verses.

# పురుష సూక్తము
## మంత్రార్థ వివరణము

సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ ।
సభూమిమ్ విశ్వతో వృత్వా అత్య తిష్ఠద్దశాఙ్గులమ్॥

**తాత్పర్యము :**

అసంఖ్యాకములైన శిరస్సులు, అసంఖ్యాకములైన నేత్రములు, పాదములు కలిగియున్నట్టి విరాట్ స్వరూపుడైన పురుషుడు విశ్వమంతా వ్యాపించి దశాంగుళ ప్రమాణమున అన్ని లోకములను అధిగమించెను.

**వివరణము :**

సహస్రమనగా అసంఖ్యాకమని భావము. సకల చరాచర జగత్తంతటాఆ పురుషుడే వ్యాపించియున్నాడు గనుక సర్వజీవుల శిరస్సులు, నేత్రములు, పాదములు ఆయనవే. విశ్వమంతటా అన్ని రూపాలలో ఆయనే వ్యాపించి తిరుగుతున్నాడు గనుక అంతటను ఆయన పాదములున్నట్లు చెప్పబడినది.

భూమి యనిన స్థూలరూపములు గల బ్రహ్మాండ గ్రహ గోళములన్నియు అని అర్థము. వాటి కన్నిదిక్కులా ('అంగుళమ్' అనిన కోణము లేక దిక్కు అని భావము) వ్యాపించి అటు జీవునిలోనూ ఇటు విశ్వములోనూ భూమి, జల, అగ్ని, వాయు, ఆకాశ, మనోబుద్ధి అహంకారములను ఏడు పొరలచే పురుషుడు తన కేవల చైతన్యస్థితిని ఆవరించియున్నాడు. అందు ప్రతిఒక్కటి ఒకదానికంటే నొకటి పదిరెట్లధికముగా వ్యాపించియుండుట దశాంగుళ ప్రమాణమున అతిక్రమించి యుండుట అని అర్థము. నాభికి పదియంగుళముల పొడవున జీవుని హృదయ స్థానమున ఈ కేవల చైతన్యము జీవునికనుభవమగుట అనికూడా అర్థము. నాభికి దశాంగుళముల పైన హృదయస్థుడై ఆ పరమాత్మ సర్వ అనుభూతులలోను వ్యాపించియున్నాడు. విశ్వమంతటా పురుషుడు కాలరూపమున అతిక్రమించియున్నాడు.

గర్భస్థ శిశువును పదిమాసముల కాలము రూపమున, బాహ్య సృష్టిని పది యవతారకాలముల రూపమున పరివర్తింపజేయును కనుక ఆవృతి రూపమున అతిక్రమించియున్నాడు.

**పురుష ఏ వేదగ్ం సర్వమ్ యద్భూతం యచ్చభవ్యమ్ ।**
**ఉతామృతత్వ స్యేశాన: యదన్నేనాతిరోహతి॥**

**తాత్పర్యము :**

పురుషుడు ఈ జగత్తునందే గాక యింకను విస్తరించి యున్నాడు. జరిగినది, జరుగబోవునది, జరుగుచున్నది (భూత భవిష్యద్వర్తమాన) అంతయు ఆది పురుషుడే. ఆహారము చేత జీవించి వృద్ధిపొందు జీవులన్నిటియందు అమృతస్వరూపుడై మోక్షమునకు ప్రభువై యున్నాడు.

**వివరణము :**

చరాచర సృష్టి అంతా పదార్థ భూయిష్టమయియున్నట్లగుపించిననూ అట్టి పదార్థమునకాధారము, అతీతము అయిన 'చైతన్యము' లేక శాశ్వతమైన జీవశక్తి రూపమున పురుషుడున్నాడు. భూత భవిష్యద్వర్తమాన స్వరూపమైన ఈవిశ్వమంతా పురుషుని సంకల్పమే. సృష్టి స్థితి లయములను ఆద్యంతరహిత పరిణామములకు అతీతుడు, ఆధారభూతుడు అయిన ఆ పురుషుడే అమృతత్వము (మోక్షము) నకు ప్రభువు. అట్టి పురుషుడు సంకల్పంచేత యిట్టి పరిణామములను పొందుచు, కర్మబంధములను తొలగించుకొనిన జీవాత్మలు అమృతత్వము (మోక్షము), లేక పరమాత్మస్థితిని పొందగలందులకు ఈ జగద్రూపమున వ్యక్తమైయున్నాడు.

**ఏతావానస్య మహిమా అతోజ్యాయాగ్ంశ్చపూరుష:।**
**పాదో ౽ స్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి॥**

**తాత్పర్యము :**

పూర్వోక్తమైన ఆ పురుషుని మహిమ చాలా గొప్పది, ఆయన ఇంకనూ గొప్పవాడు. ఈ మహిమయంతము పురుషునిలో నాల్గవ భాగము మాత్రమే. మిగిలిన మూడు భాగములు నిత్యములై ఆత్మస్వరూపమున పై లోకముల ప్రకాశించుచున్నవి.

Note: This book contains printing mistakes in the sanskrit verses

వివరణము :

ఈ వ్యక్తమైనట్టి, భూత భవిష్యద్వర్తమాన కాలములందు జగత్తునందు వ్యాపించిన సృష్టియంతయూ పురుషుని మహిమయే. ఆపురుషుడు అతని మహిమకన్నను గొప్పవాడు. ఈ వ్యక్తమైన సృష్టిజాలమంతా విరాట్పురుషునిలో నాల్గవ భాగము మాత్రమే. అమృతస్వరూపమైన ఆయనలోని మిగిలిన మూడు భాగములు వినాశ రహితము, నిత్య జ్యోతి స్వరూపమున ప్రకాశించుచున్నవి.

ప్రకృతి ప్రేరకుడైన ఆదిపురుషుడు సంకల్ప మాత్రముచే సృష్టి రూపమున వ్యక్తమై సర్వత్రా వ్యాపించియుండి, అట్టి మహిమ కతీతుడై నిత్యుడై సాక్షీభూతునిగా ప్రజ్వరిల్లు చున్నాడు.

జీవుని దృష్టినుండి చూచిన చైతన్యముయొక్క నాల్గవ భాగమైన మెలకువ లేక జాగ్రత్తు అనెడి పాదమే ఈ సర్వజగత్తు. స్వప్న, సుషుప్తి, తురీయముల రూపమున పురుషుడు అవ్యక్తుడై యున్నాడు. విశ్వముయొక్క కోణమునుండి చూచిన నారాయణుడను పురుషునకు పరము, వ్యూహము, విభవము, అర్చా రూపములను నాలుగు అంశములున్నవి. ఈ స్థితులలోని చైతన్యమును అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ నామములతో పూర్వులు చెప్పిరి.

విశ్వాత్మకుడైన పురుషుడు ప్రకృతి, పురుషుడుగా విభజన చెందెను— ఒకవ్యక్తి చైతన్యము ఊహలలోని రూపాలుగానూ వాటిని సాక్షిభూతంగా చూచే సాక్షి చైతన్యముగానూ యేర్పడినట్లు. సృష్టిలోని నామరూపాలన్నీ ప్రకృతిరూపాలు. దానికాధారమైన నిరాకారము నిర్లిప్తము అయిన చైతన్యము పురుషుడు. ప్రకృతి పురుషుని నుండి ఉత్పన్నమై తిరిగి దానియందే ఐక్యత అను లయమును చెందును. ఇదే సృష్టియాల కథ. నామరూపాత్మకమైన ప్రకృతంతా పురుషునియొక్క అంశమే గనుక ఈ విశ్వాలన్నీ ఆ పురుషుని యొక్క ఒక్క పాదమేనని చెప్పడమైనది.

**త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదో ఽస్యేహాభవాత్పునః।**
**తతో విష్వఙ్వ్యక్రామత్ సాశనానశనే అభి॥**

తాత్పర్యము :

మూడు పాదములుగా నున్నట్టి పురుషుడు తిరిగి జగత్తుగా ఉదయించి వ్యాప్తిచెందెను. ఇట్టి పురుషునకు పెరుగుట తరుగుట యనునవి లేవు. ఇతని యొక్క నాల్గవవంతు జగత్తయినది. అట్లు ఉదయించిన పురుషుడు జగత్తునందంతటనూ అంతరాత్మగా వ్యాపించెను.

**వివరణము :**

స్థావర జంగమములయందు - ఆహారముపై జీవించు జీవుల యందు (సాశనములు), జీవధర్మములు లేనట్టి పర్వతములు, నదులు, ఖనిజములు (అనశనములు), సచేతనములు, అచేతనములు మొదలగు వివిధ దశలలోనికి పురుషుడు వ్యాపించియుండి వాటి యన్నింటికీ అతీతుడూ అస్పృష్టుడై మాయచే కప్పబడియుండి -- సృష్టి సంహారములద్వారా పునః ప్రకాశితుడగును. పిమ్మట మాయ ఆవరించుటచే దేవ తిర్యగ్ మొదలయిన రూపములతో విభిన్నముగా వ్యాపించును.

పూర్వపు ప్రళయానంతరము తిరిగి జరిగేసృష్టి క్రమమునిక్కడ సూచించడమైనది. దానిని గాఢనిద్ర నుండి తిరిగి మెలకువను పొందుటతో పోల్చవచ్చు. గాఢనిద్రనుండి స్వప్నావస్థ, దానినుండి జాగ్రత్తుకు పూర్వముందు తురీయావస్థ, దాని నుండి జగదనుభూతి రూపకమైన మెలకువ కలుగును. నిద్రనుండి మెలకువ, మెలకువ నుండి నిద్రకూ మారెడి సంధిలో తురీయానుభూతి స్వల్పకాలము కలుగునని, తిరిగి అట్టి స్థితే ఒక యోచనకూ మరొక యోచనకూ నడుమ సంధికాలమున తృటికాలము సంభవించునని కొన్ని యోగ శాస్త్ర గ్రంథములందు చూడనగును. అట్లే మహాకారణమునుండి కారణము, దాని నుండి సూక్ష్మము, దాని నుండి స్థూలమూ అయిన సృష్టి ఏర్పడుననికూడ ఈ మంత్రము తెలుపుతున్నది. కనుక పురుషుడు మహాకారణ, కారణ, సూక్ష్మలోకాలుగా వ్యాపించి చివరకు తిరిగి (అనగా క్రిందటి ప్రళయమునకు పూర్వమువలె) స్థూల రూపమున కూడ వ్యాపించునని చెప్పబడినది.

**తస్మాద్విరాడజాయత విరాజోఅధిపూరుషః**

**సజాతో ఽ త్యరిచ్యత పశ్చాద్భూమిమథోపురః॥**

**తాత్పర్యము :**

అట్టి పురుషునినుండి విరాట్ ఉద్భవించెను. ఆ విరాట్ అనురూపము నధిష్ఠించి పురుషుడుద్భవించెను. ఆ విరాట్పురుషుడు భూమికి అన్ని వైపులా వ్యాపించెను.

**వివరణము :**

మొదట విరాట్ (ఎక్కువగా ప్రకాశించు గుణము గల) అను కాంతి గోళమువంటి అండముద్భవించినది. అందుకే పురుషునకు హిరణ్యగర్భుడని పేరు. అట్టి (విరాట్) కాంతిగోళము తన ఉనికి యొక్క స్ఫురణ కలిగియుండును. అదే సృష్టియంతటికీ ఆధారమైన ఆది సంకల్పము. అట్టి విరాట్టునుండి పురుషుడుద్భ వించెను. అనగా తండ్రియైన ఆదిపురుషుని నుండి పుత్రుడైన విరాట్పురుషుడుద్భ వించెనని అర్థము. ఆ వెలుగే జ్ఞానస్వరూపము. సృష్టియంతటికీ ఆత్మ వంటి విరాట్, సంకల్పము చేత తన నుండి ఈసృష్టి సంతటినీ యుద్భవింపజేయును. ఆ విరాట్పురుషుడు బ్రహ్మాండమునకు పైనాక్రిందా ముందువెనుకలా, అన్నివైపులా వ్యాపించెను.

చైతన్యమున సంకల్పముత్పన్నమైనప్పుడే ఆ సంకల్పము స్వయం ప్రకాశమై వెలుగును. విరాట్పురుషుడు ఆది చైతన్యమున అట్లే విరాజిల్లెను. 'గనుక విరాట్పురుషుడనబడెను. శుద్ధ చైతన్య రూపమైన ఆత్మయందు పరిమిత చైతన్య రూపమైన అహంకారము భాసించుట దానికి సారూప్యము. విశ్వమంతటినీ తన దేహముగాగల అహంకారమే విరాట్పురుషుడు. సంకల్పమునకతీతముగా అన్నిదశలా మూలచైతన్యమున్నట్లు బ్రహ్మాండమునకు అన్నివైపులా విరాట్పురుషుడు, అతనికతీతముగా విశ్వచైతన్యము వ్యాపించి యున్నవని అర్థము.

**యత్పురుషేణ హవిషా దేవాయజ్ఞ మతన్వత।**
**వసంతో అస్యాసీదాజ్యమ్ గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥**

**తాత్పర్యము :**

దేవతలు పురుషుడను హవిస్సుచే యజ్ఞముచేసిరి. దేవతలు అనగా సాధ్యులు, ఋషులు, ఈ యజ్ఞమునందు వసంతఋతువు అజ్యముగను, గ్రీష్మము సమిధలు, శరత్తు ఆజ్యాతిరిక్తమగు హవిస్సుగనూ యుండెను.

Note: This book contains printing mistakes in the sanskrit verses

వివరణము :

పురుషుడు పుట్టునపుడు దేవతలు వాని శరీరభాగములుగా అయిరి. చాక్రాకారముగా తిరుగు కాలస్వరూపమైన సంవత్సరమే వారు నిర్వహించు యజ్ఞము. ఈ కాలచక్రమే కాలపురుషుడు.

ఈ సంవత్సరాత్మకమైన యజ్ఞమున వసంతఋతువు ఆజ్యమైనది. వసంతము సంవత్సరమునకు మొదలు. ఆ సమయమున సర్వత్రా వ్యాపించియున్న ఆదిపురుషుడు ప్రకృతి రూపమున విశేషముగా పుష్పించి ఫలించి ఫలపుష్పభరితమై మధురముగా ప్రకాశించును. ఇట్లు అగ్నిని ప్రకాశింపజేయు ఋతువు గనుక ఆజ్యమని చెప్పబడినది. ఆజ్యము వేసినపుడు అగ్ని ప్రజ్వలించిన విధముగా వసంతమున సర్వప్రకృతీ ఒక్కసారి ప్రజ్వలించి యజ్ఞాగ్నివలె వెలిగి ఆనందతాండవమాడును.

గ్రీష్మ ఋతువున ఎండలు మండించుట చేత ఆ ఋతువు సమిధయని చెప్పబడినది. శరత్తునందు సస్యములు ఫలించి సర్వజీవులకు ప్రకృతి ఆహారము సిద్ధపరచును. ఆహారమే హవిస్సు. జఠరాగ్నే అగ్నిహోత్రుడు. శరదృతువునుండే ఈ అగ్నికి హవిస్సు లభించును. అందువలన శరత్తు హవిస్సయినదని చెప్పబడినది. ఇందు సమన్వయపడనట్లు కన్పించు అంశముల వివరములు ఉపోద్ఘాతమున చూడవలెను.

**సప్తాస్యాసన్ పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః**

**దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుమ్ ॥**

తాత్పర్యము :

అట్టి సృష్టియజ్ఞమున దేవతలు పురుషుని యజ్ఞపశువుగా చేసిరి. ఆ యజ్ఞమున ఏడు పరిధులు, యిరువది యొక్క సమిధలు వుండునట్లుచేసి అందు పురుషుని బంధించిరి.

Note: This book contains printing mistakes in the sanskrit verses.

వివరణము :

నిత్యము చక్రాకారమున పరిభ్రమించు సంవత్సరాత్మకమైన కాలచక్రమున జరుగు యజ్ఞమున సూర్యుడు సర్వమును హుతము చేయు కాలస్వరూపుడగు యజ్ఞాగ్ని. అందు నిత్యము హుతమగు కాలములు సమిధలు. సప్తగ్రహాల పరిధులు ఏడావరణములు.

విరాట్పురుషునియందు పంచభూతములు, మనస్సు, అహంకారము కేవల చైతన్యమును ఏడు పొరలుగా ఆచ్ఛాదించి యుండుట ఈ యజ్ఞమున మొదటి పరిధిగానున్న ఏడు సమిధలు. జీవుని దేహమందు దేహ మానసములనున్న పంచభూతములు, మనస్సు, అహంకారములు రెండవ పరిధిలోని ఏడు సమిధలు. భూమిపైనున్న జీవరాశిని పరివేష్టించియుండు ఏడు గ్రహములు మూడవ పరిధిగా నున్న సమిధలు. ఈ మూడు పరిధులలోనున్న సమిధలు ఈ సృష్టి అనెడి యజ్ఞరూపమున పురుషుని బంధించియున్నవి.

జీవచైతన్యము సప్తవ్యాహృతులచే సూచింపబడు ఏడు స్థాయిల అజ్ఞానపు పొరలచే ఆవరింపబడిన సప్తాశ్వాసములు. త్రిస్సప్త సమిధలు ఆ అజ్ఞానముయొక్క అంశములే.

ఈ ఇరువది యొక్క పరికరములతో, పాశములతో దేవతలు జీవుడైన పురుషుని శరీరమున బంధించి యజ్ఞపశువుగా చేసిరి. అట్టి బంధముల నుండి విడువడిన జీవుడు ముక్తిపదమునొందిపరమాత్మ స్థితిని పొందును. (విద్యారణ్య భాష్యము.)

**తం యజ్ఞం బర్హిషి ప్రౌక్ష " పురుషం జాతమగ్రతః॥**
**తేన దేవా అయజన్తస్సాధ్యా ఋషయశ్చయే॥**

తాత్పర్యము :

హిరణ్యగర్భుడైన ఆదిపురుషుడే యజ్ఞసాధనాభూతుడు. అట్టి యజ్ఞపురుషుని దర్భలయందు స్థాపించి దేవతలు, ఋషులు యజనము చేసిరి.

Note: This book contains printing mistakes in the sanskrit verses

**వివరణము :**

దేవతలు సృష్టికి పూర్వమున యున్నట్టి అంతర్యామియైన ఆదిపురుషుని ప్రోక్షించి, బంధించి, అటుపిమ్మట జీవుని పశువుగా బంధించి, యజనముచేసి యర్చించిరి. యజ్ఞముచే యజ్ఞ సాధనములు గ్రహింపబడుచున్నవి. హవిస్సుయొక్క అభావమునందు ప్రధమమున నుద్భవించిన యతడే హవిస్సగుచున్నాడు. 'ప్రోక్షన్' పదముచే సకల సంస్కారములును గ్రహింపబడుచున్నవి. యజ్ఞ సాధనా భూతుడైన వానిని ప్రోక్షనాది సంస్కారములచే సంస్కరించి దేవతలు యాగముచేసిరని అర్థము. (విపుల వివరణకు ఉపోద్ఘాతము చూడవలెను.)

**తస్మాద్యజ్ఞాత్సర్వహుతః సంభృతం పృషదాజ్యమ్ ।**
**పశూగ్ం స్తాగ్ంశ్చక్రే వాయవ్యా ఆరణ్యా గ్రామ్యాశ్చయే॥**

**తాత్పర్యము :**

పూర్వోక్తమగు పురుషమేధమను యజ్ఞమువలన సమస్తము హుతమగుటవలన యజ్ఞస్వరూపమగు పృషదాజ్యమను (చిలుకబడిన వెన్న) హవిస్సు సమకూరినది. ఆ హవిస్సు నుండి వాయువునందు, అరణ్యములందు, గ్రామ్యములందు సంచరించు జీవులన్నియూ ఉద్భవించెను.

**వివరణము :**

అట్టి యజ్ఞమున సర్వము హుతమయ్యెను. దాని నుండి సమకూరిన ఆజ్యమునుండి వాయువునందు సంచరించునవి, అరణ్యములవసించునవి, గ్రామ్యములైన పశువులు ఉద్భవించెను.

ఇచట కాలస్వరూపుడగు యజ్ఞపురుషుని శరీరము రాశి చక్రముతో పోల్చబడినది. దీనియందు హుతముచేయబడిన జంతువులు రాశిచక్రమున మేషాది రాసులకు చిహ్నములైన జంతువులుగా పోల్చడమైనది. 'ఆరణ్యాన్' అనిన అరణ్యమున సంచరించు సింహము మొదలగునవి సింహరాశిని సూచించును. 'గ్రామ్యాంశ్చ' అని గ్రామములందు సంచరించు వృషభములు మొదలగు జంతువుల వలన వృషభరాశి, 'అజావయః' అనిన మేషములు (మేషరాశి) — ఈ విధముగా తరువాత మంత్రములయందు యితరరాసులు సూచింపబడినవి.

Note: This book contains printing mistakes in the sanskrit verses

సర్వహుతమనబడు ఈ యజ్ఞమునుండి సర్వజీవరాసులు నుద్భవించి, తిరిగి హవిస్సుగా చేయబడి ఆ యజ్ఞమునందే హుతమగు చున్నవి. నిత్యము తూర్పున ఉదయించు గ్రహాధిపతియైన సూర్యుడు తన చలనమువలన సంవత్సరమును యజ్ఞమున మేషాది రాసులను యజ్ఞపశువులనుజేసి హుతముచేయుచున్నాడు. యజ్ఞాగ్నియైన సూర్యుడు సర్వహుతమైనట్టి యజ్ఞపశువులైన రాసులను తిరిగి తూర్పున జనింపజేయుచున్నాడు. ఇట్లు ఈ యజ్ఞము నిత్యము జరుగుచుండును.

సృష్టి లయములనబడు ఆద్యంత రహితములైన క్రియలు నిత్యమూ జరుగునదే సర్వహుతమను యజ్ఞము.

**తస్మాద్యజ్ఞా త్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే।**
**ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాదజాయత॥**

**తాత్పర్యము :**

సర్వము హుతము చేయబడినట్టి ఆ యజ్ఞమువలన యజ్ఞ పురుషునినుండి ఋక్కులు, సామములు, గాయత్రి మొదలగు ఛందస్సులు ఉద్భవించెను. అందుండియే యజుర్వేదముజనించెను.

**వివరణము :**

మొదలు ఒక్కటిగనున్న విశ్వచైతన్యము తాను బహుధా అగునట్లు సంకల్పించి అట్లగుటయే ఈ సృష్టికి కారణమని వెనుక వివరించబడినది. అట్లయినను మూలతత్త్వముయొక్క ఏకత్వము నశింపదు. ఉపోద్ఘాతమున చెప్పబడినట్లు ఏకత్వము సాక్షి చైతన్యము వలేనుండి, అనేకత్వము అందుండి ఉత్పన్నమగు ఊహల పరంపర వలె దానితో ఎప్పుడునూ కలిసియే యుండును. ఏకత్వమును పురుషుడనియు, అనేకత్వమును ప్రకృతియనియు, ఈ రెండింటి ఐక్యతయే అర్ధనారీశ్వరుడనియు మన పూర్వీకులు చెప్పిరి. వాక్కు, అర్థమువోలె పార్వతీ పరమేశ్వరులు కలిసి యుందురని, వారే జగత్పితరులని కాళిదాసు చెప్పియున్నాడు. దీని యందు అనేకత్వము యొక్క ఉత్పత్తిని గూర్చి పురుషసూక్తమున చెప్పబడినది. అయినను అనేకత్వమంతటనూ ఏకత్వము నిండియుండును గనుక సృష్టియంతయు పురుషుని సూపమేయని చెప్పబడినది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

ఈ ప్రకృతిని శక్తియనియు, ప్రాణమనియుకూడ అందరు. అట్టిశక్తి యొక్క వివిధ లయతాళములతో కూడినట్టి సమగ్ర నృత్య రూపమే మనకు గోచరించు స్థూల ప్రకృతి.

అధునిక భౌతిక శాస్త్రముగూడ సృష్టికి మూలమైనట్టి శక్తి వివిధ తరంగ దైర్ఘ్యములతో చలించుట వలననే వస్తు బాహుళ్య మేర్పడినదని చెప్పుచున్నది. ఈ వివిధ తరంగ దైర్ఘ్యములతో కూడిన చలనమునే ఛందస్సులని మన పూర్వీకులు చెప్పిరి. శక్తి యొక్క ఛందోబద్ధమయిన ప్రవృత్తినే 'ఋతము' అనిరి. ప్రాచీన చైనాలోని తత్త్వవేత్తలు దానిని 'తావో' (లేక రీతి) అన్నారు. దీనిని తన తపశ్శక్తిచే ప్రత్యక్షముగ దర్శించినవాడు 'ఋషి' (అనిన ఋతము తెలిసినవాడు). అట్టి జ్ఞానమువలన కలిగిన పారవశ్యమున అతని నోటినుండి అప్రయత్నముగ వెలువడిన శబ్దరాశి 'ఋక్కు' *ఇట్టి ఋక్కుల సమగ్ర రూపము ఋగ్వేదము. సృష్టిని యజ్ఞ రూపమున దర్శించుటకు సాధనముగ యజ్ఞము చేయుటకొరకు ఋక్కుల వినియోగమును సూచించు వేదమంత్రరాశి యజుర్వేదము. అట్టి ఋక్కులనే నాదోపాసనగా గానము చేయవలసిన రూపమే సామవేదము. ఈ మూడు వేదములు ఒకే శక్తి నుండి యుత్పన్నమైనవి గనుక సర్వహుతమను యజ్ఞమునుండి వేదములు ఉత్పన్నమైనట్లు చెప్పబడినవి.

**తస్మాదశ్వా అజాయన్త ఏకేచో భయాదత:**
**గావోహ జజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయ:॥**

**తాత్పర్యము :**

ఆ యజ్ఞము నుండియే ఒకవరుస, రెండువరుసల దంతములు గల అశ్వాది పశుజాలము, మేకలు మొదలగునవి ఉద్భవించెను.

**వివరణము :**

జీవులలో వృద్ధిపొందు కోరికలు, కామక్రోధములు మొదలగు శక్తులుగూడ పశుజాలములే. ఇవి శుద్ధినొంది సత్వము వృద్ధి పొందినప్పుడు జీవునికి రససిద్ధి కలిగి మోక్షపదము కలుగును.

---

* అనుబంధము 1 చూడుడు.

Note: This book contains printing mistakes in the sanskrit verses

ఇంకను ఇందువలన వాయు సంబంధమైన వివిధ వాయువుల (Gases) సృష్టియు, అరణ్యములనుండి అగ్ని సంబంధమైన (అరణి నుండి ఉద్భవించిన) సృష్టిగూడ సూచించబడినది.

**యత్పురుషం వ్యదధుః కతిథా వ్యకల్పయన్।**
**ముఖం కిమస్య కౌబాహూ కావూరూ పాదవుచ్యేతే॥**

**తాత్పర్యము :**

ఇట్లు యజ్ఞము చేయబడిన పురుషుడెట్టివాడు? ఆయన ముఖమేది? బాహుద్వయమేది? వాని పాదములేవి?

**వివరణము :**

దేవతలు పురుషుని యజ్ఞపశువుగచేసి యజ్ఞము చేసినపుడు ఆ పురుషుని యేభాగములనుండి సృష్టియందు ఏ అంశము యేర్పడినవని ప్రశ్నవేయబడి తరువాతా మంత్రమున సమాధానము చెప్పబడినది.

**బ్రాహ్మణో உస్య ముఖమాసీత్ బాహూరాజన్యఃకృతః।**
**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రోஅజాయత॥**

**తాత్పర్యము :**

బ్రాహ్మణులు సృష్టికిపూర్వము యజ్ఞపురుషునకు ముఖముగ నుండిరి. ఆయన బాహువులు క్షత్రియులుగా చేయబడినవి. ఆయన ఊరువులు వైశ్యులాయెను. పాదద్వయమునుండి శూద్రులు పుట్టిరి.

వివరణము :

పురుషుని శరీరమునందలి వివిధ భాగముల ప్రాధాన్యతనూ, స్వభావయులనూ అనుసరించి ఆయా శరీరభాగములనుండి వివిధ స్వభావములు, ప్రవృత్తులుగల నాలుగు వర్ణములవారునూ ఉద్భవించినట్లు చెప్పబడినది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

వాక్స్వరూపమగు జ్ఞానములకు ముఖము ముఖ్యస్థానము. ఉత్తముని ముఖము సత్యవాక్కునకును, విద్యాసంస్కారబోధనమునకును మూలము. (అందుకే వేదములు బ్రహ్మ ముఖములనుండి వ్యక్తమైనవని చెప్పబడినది.) అట్టిది సహజ ధర్మముగా గలవారిని బ్రాహ్మణులనిరి. అందువలననే బ్రాహ్మణులు బ్రహ్మ యొక్క ముఖమని చెప్పబడినది. భుజబలము, శౌర్యపరాక్రమములు కలిగి యుండు క్షత్రియులు పురుషుని భుజములనుండి ఉద్భవించినట్లు చెప్పబడినది. వారు ధర్మరక్షణ దుష్టశిక్షణ చేయుటకును, సామాజిక శ్రేయస్సు కొరకును ఏర్పడినవారు. (సంపద, ధనము) కృషి వ్యాపారము మొదలగునవిచేసి ఆర్జించి సమాజమునకు అర్థబలము చేకూర్చు వైశ్యులు బలిష్ఠమైనట్టి పురుషుని ఊరువులనుండి యుద్భవించినట్లు చెప్పబడినది. అట్లే శారీరకశ్రమ చేయు స్వభావము కలిగియున్నట్టి శూద్రులు పురుషుని పాదములనుండి యేర్పడిరని చెప్పబడినది. సమాజము వారికృషిపై నాధారపడి యుండునని సూచన.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణముల వారు సృష్టింపబడి, యే వర్ణమునకేగుణము నియమింపబడినదో తదుపరికూడ ఆయా వర్ణములు ఆ గుణములను పొందునట్లు మనుస్మృతిలో సృష్టిక్రమ వర్ణనయందు వివరింపబడినది. ఈ సృష్టి యజ్ఞము ననుసరించి నడచుటకు వలసిన జీవితవిధానము ధర్మము. స్వధర్మయజ్ఞ వ్యవస్థ వివిధ వర్ణములననుసరించి వారాచరించుటకు బ్రహ్మచే సృష్టింపబడినదని భగవద్గీతలో చెప్పబడినది. అనగా ఆయా జీవుల గుణకర్మ విభాగములవలన సహజముగ చాతుర్వర్ణ్య మేర్పడినదని భావము.

మానవజాతి యంతము సమాజముగ నేర్పడినపుడు జరుగు క్రియ సామాజిక యజ్ఞము, శరీరములో వలె సమాజమునగూడ వివిధ వృత్తులు నిర్వహించు వ్యక్తులు వివిధ మనో ప్రవృత్తులుగల వారందరును ఆశరీరములోని అంగములవలె సంఘశ్రేయస్సు కొరకు ఎట్లు పనిచేయవలెనో సూచించు నిమిత్తమే యజ్ఞపురుషుని వివిధ శరీర భాగములనుండి వివిధ వర్ణముల వారుద్భవించినట్లు చెప్పబడినది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

కాని నేటి కులములు సంకుచిత భావమును పెంపొందించి పరస్పర వైరములకు, భేదములకు కారణమగుచున్నవి. ఆదిలో ఏర్పడినవి వర్ణములు (Classes) గానీ కులములు (Castes) గావు. ఈ వర్ణధర్మములుగూడ ఆయా జీవులయొక్క పూర్వకర్మల ననుసరించి పుట్టుకతోడనే అట్టి స్వభాములేర్పడినవని భగవద్గీతలో చెప్పబడినది.

పురుషుడు ప్రకృతి అను రెండంశములు గల మూలతత్త్వమును సంయుక్త జీవకణముతో పోల్చవచ్చును. దానియొక్క విభజనవలన అసంఖ్యాకములైన జీవకణములతో చేయబడిన జీవదేహము లేర్పడునని జీవశాస్త్రము చెప్పుచున్నది. అట్టి జీవకణములన్నియు ఆ జీవి భావికాలమున జీవించుటకవసరమగు వివిధ దేహభాగములుగ రూపొంది, ఆయా కార్యములను నిర్వహించు సహజమైన అభినివేశము కలదిగ నేర్పడు సూత్రము సృష్టి క్రియకుకూడా అన్వయించును. మానవ సమాజము అభ్యుదయమును పొందుటకు నాలుగు పురుషార్థములను సాధించవలసి యున్నది. అందుకవసరమగు అవయవముల రూపమున సమాజమనబడు సమిష్టి దేహమునకు అభ్యుదయమును చేకూర్చు ఆయా జీవ కణములవలె, సహజముగనే మోక్షప్రదమగు జ్ఞానములు ప్రసాదించు బ్రాహ్మణులు, ధర్మమును సాధించు క్షత్రియులు, అర్థమును సమకూర్చు వైశ్యులు, జీవితావసరముల రూపముననున్న కామమును సాధించు శూద్రులును ఉత్పన్నమయ్యిరని దీనిభావము.

**చంద్రమా మనసోజాతః చక్షోస్సూర్యో అజాయత।**
**ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత॥**

**తాత్పర్యము :**

ఆ పురుషుని మనస్సు నుండి చంద్రుడు, నేత్రములనుండి సూర్యుడు, ముఖమునుండి ఇంద్రుడును అగ్నియు, ప్రాణమునుండి వాయువు నుద్భవించిరి.

**వివరణము :**

మానవుని మనస్సుపై చంద్రునియొక్క ప్రభావము అధికముగా నుండునని జీవశాస్త్ర, మనస్తత్వ శాస్త్రములు కనుగొన్నవి. అట్లే జ్యోతిష శాస్త్రమునగూడ చంద్రగ్రహము యొక్క చలనగతులు జాతకునియొక్క మానసిక స్థితిని సూచించునని

Note: This book contains printing mistakes in the Sanskrit verses

చెప్పబడినది. పురుషుని మనస్సునుండి చంద్రుడుద్భవించినట్లు చెప్పబడుటకు కారణము మానవుని మనస్సుపై చంద్రునికిగల ప్రభావమే.

మన కంటియొక్క చూపునకు వెలుగు ఆధారమయినది. వెలుగులేనిచో కంటికి చూపులేదు. జగత్తంతటికిని వెలుగును ప్రసాదించువాడు సూర్యుడు. దానిని పరిశీలించుటకు జీవులయందు పనిచేయు అట్టి చైతన్యమే విరాట్పురుషుని చైతన్యము గనుక సూర్యుడు అతని నేత్రములనుండి యుత్పన్నమయినట్లు చెప్పబడినది.

దేవరాజైన ఇంద్రుడు వాక్కునకు అధిపతి. ఇతడు వాక్కు మూలమున వెలువడు సంకల్పము. దేవతలకు యజ్ఞమునందు సమర్పించబడు హోమ ద్రవ్యముల నందించు వాహకుడు వహ్ని లేక అగ్ని. జీవుల దేహములయందు వివిధ యింద్రియ సామర్థ్యముల రూపముననున్న శరీరగత దేవతలకు ఆహార రూపమున ముఖము ద్వారా అందించి పోషించునుగనుక ఇంద్రుడు విరాట్పురుషుని ముఖమునుండి యుద్భవించినట్లు చెప్పబడినది. అట్లు ముఖమున గ్రహింపబడిన ఆహారము శరీరగత దేవతలకు (హవిస్సు) వహింపబడును గనుక వహ్ని లేక వైశ్వానరాగ్ని యజ్ఞపురుషుని ముఖము నుండి ఉత్పన్నమయినట్లు చెప్పబడినది.

ఈ యావత్ సృష్టి రూపమున ప్రకటమైన చైతన్యశక్తియే ప్రాణము. ప్రాణమనిన చైతన్యయుతమైన చలనమని అర్థము. సృష్టియంతయు వివిధ స్థాయిలలో చలన భూయిష్టమయినదే. అట్టి చలనమున కాధారమయిన ప్రాణశక్తి యజ్ఞపురుషునియొక్క ప్రాణశక్తి నుండి వాయు రూపమున ఉద్భవించి, అదియే శ్వాసరూపమున జీవులకు ఆధారమైన ప్రాణశక్తిగా నున్నది.

**నాభ్యా ఆసీదంతరిక్షమ్ శీర్ష్ణోద్యౌస్సమవర్తత ।**
**పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్ తథాలోకాగ్ం అకల్పయన్ ॥**

**తాత్పర్యము :**

ఆ పురుషుని నాభినుండి అంతరిక్షము, శిరస్సునుండి సత్య లోకము నుద్భవించెను. ఆయన పాదములనుండి భూమి, కర్ణముల నుండి దిక్కులు ఏర్పడి ఇట్లే సర్వలోకములు ఆయనయందే కల్పింపబడినవి.

Note: This book contains printing mistakes in the sanskrit verses

వివరణము :

పదమూడవ మంత్రమున పురుషుని దేహభాగముల నుండి మానవ సమాజమున వివిధ వర్ణము లేర్పడిన విధము చెప్పబడినది. అట్లే ఈ మంత్రమున అతడి శరీర భాగములనుండి ఏయే లోకములు ఉత్పన్నమైనవో చెప్పబడుచున్నది. లోకములనిన వివిధ స్థాయిల చైతన్యము మనకనుభవమగు వివిధ స్థితులు. చైతన్యస్థాయి ననుసరించి తదనుగుణమైన లోకమున్నట్లనుభవమగును. జాగ్రత్తునందు భౌతిక జగత్తునూ, స్వప్నమునందు స్వప్న జగత్తునూ, ఊహల యందూహాజగత్తునూ అనుభవమయినట్లు మరణమనబడు చైతన్యస్థితి యందునూ, ధ్యానస్థితుల యందునూ ఆయా లోకములు అనుభవమగును.

యోగి నాభికమలమునందు సంయమము చేసిన తనయందుగల 72,000 నాడులతో (ఈనాడులు కేవలము ప్రాణమయములు) అల్లుకొనబడిన దేహనిర్మాణమును దర్శించునని యోగశాస్త్రము. అట్లే పురుషుడు సృష్టికాలమున ఖగోళమును సృష్టించుటను తన నాభికమలమున సంయమము చేయుటగా సూచింపబడినది.

మానవులలో దిక్కును గూర్చిన ప్రజ్ఞ చెవుల సమీపమున నుండునని నేటి శారీరక శాస్త్రము చెప్పుచున్నది. అందువలన శ్రోత్రముల నుండి దిక్కులుద్భవించినవని చెప్పబడినది.

పాదములనుండి స్థూల పదార్థ రూపమైన (భూమి) జగత్తు ఉత్పన్నమయిన దనియు, అది పురుషునియందు ఒక భాగము మాత్రమే ననియు చెప్పబడినది.

ఇట్లు మనలోని దేహభాగముల వలన సంభవించు ప్రక్రియల ననుసరించి పురుషునినుండి లోకములుత్పన్నమయినట్లు చెప్పుట రూపకాలంకారము మాత్రమే కాదు. ఆ పురుషుడే అన్ని జీవులయందు నిలచి ఆయారీతుల సృష్టిననుభవించుటయే సృష్టి జరుగుట.

Note: This book contains printing mistakes in the sanskrit verses

వేదాహమేతం పురుషం మహాన్తమ్ ఆదిత్యవర్ణం తమసస్తుపారే।
సర్వాణి రూపాణి విచిత్యధీర : నామానికృత్వా ౽ భివద ॑ యదాస్తే॥

**తాత్పర్యము :**

సకల జీవరాసులను సృష్టించి వివిధ వస్తు బాహుళ్యమేర్పరచి అన్నిటియందు వ్యాపించియున్న పురుషుని "చీకటి" కవ్వల ఆదిత్య వర్ణముతో వెలుగొందు బ్రహ్మజ్యోతిగ నేను తెలుసుకొనుచున్నాను.

**వివరణము :**

సూర్యరశ్మివంటి వర్ణము (కాంతి) గలవాడును, విశ్వమంతటనూ వ్యాపించి నిండియున్న ఆదిపురుషుడు అత్యంత మహిమాన్వితుడు. అట్టి పురుషుడు సూర్యకిరణమువంటి వెలుగుగ ప్రతి జీవిలో నున్నాడు. అతడే అంతర్యామియైన విశ్వచైతన్యము.

ఆదిత్యవర్ణము చీకటికవ్వల నున్నదని చెప్పుటకొక అంతరార్థమున్నది. జీవుని యింద్రియములు బహిర్వృత్తి గలిగి యుండుట వలన వాటియొక్క పుట్టుకకు కారణమయిన ఆత్మ ('నేను' అను ప్రజ్ఞ) ఎక్కడ నుండి ప్రకాశించుచున్నదో తెలిసికొనుట సాధ్యముకాదు. మూతపడియున్న అంధకారమయమైన కారాగారమువలె యింద్రియములనెడి బంధనములతో ఎప్పుడును మనస్సు బంధింపబడియుండును. మనస్సు అంతర్ముఖ మయినపుడు యింద్రియములనెడి బంధనములు తొలగి శాశ్వతమయిన వెలుగు లేక విశ్వాత్మగా రూపొంది 'నేను శరీరమను' భావము (చీకటి) నుండి వెలువడును. ఇంద్రియాను భవముల ద్వారా జరుగు మనస్సు యొక్క బహిర్వృత్తి 'చీకటిగా' చెప్పబడినది. ఈ అంధకారమున కతీతమై వెలుగొందునది ఆదిభూతమయిన వర్ణము (ఓం) "ఆదిత్య వర్ణము" (అజ్ఞానమను చీకటి కతీతముగ నున్నట్టి జ్ఞానస్వరూపమగు తేజస్సుగ భాసిల్లు ఆదిచైతన్యమే ఈ యజ్ఞపురుషుడు) అని నేను తెలిసికొనుచుంటిని.

Note: This book contains printing mistakes in the sanskrit verses

**ధాతా పురస్తాద్యముదాజహార శక్రఃప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః**
**తమేవం విద్వానమృత ఇహభవతి నా ఽన్యఃపంథా అయనాయ విద్యతే ॥**

**తాత్పర్యము :**

మొట్టమొదట బ్రహ్మ ఎవనిని ఈ సృష్టి స్వరూపుడగు పరమపురుషునిగ తెల్పెనో, నాలుగు దిక్కులు దిక్కోణములు ఎవని మయముగ ఇంద్రుడు దర్శించెనో అట్టి ఈ యజ్ఞపురుషుని ఈ విధమున దర్శించినవాడు ఇహలోకముననే అమృతత్వము ననుభవించును. ఇట్టి శాశ్వత స్థితిని పొందుటకు వేరు మార్గములేదు.

**వివరణము :**

సృష్టికి పూర్వము ఆదిపురుషుని సంకల్పముననుద్భవించినను సృష్టికర్తయగు బ్రహ్మ ఆ పరపురుషుని తపోమూలమున గ్రహించి, ఆయనను జగత్పితగా గుర్తించి, ఆయనయందే సృష్టి స్థితి లయములు, సర్వలోకములూ దర్శించి, బాహ్యసృష్టియందు నిమగ్నుడయ్యెనని భాగవతములో చెప్పబడినది. అనగా విత్తనము నందు మొలకగానున్న వృక్షమువలె యావత్ సృష్టిని 'విరాట్' రూపమున బ్రహ్మ దర్శించి ఆ విరాట్టును సంకల్పించుట కాధారమైన శక్తిని పరమపురుషునిగా గుర్తించెను.

అట్టి బ్రహ్మ తన నాలుగు ముఖములనుండి నాలుగు విధముల నుచ్చరించిన వేదమనబడు ఒకేవాక్కు సృష్టిగా వెలువడెను. ఆ విధమున బ్రహ్మ సృష్టించిన నాలుగు విభాగములుగల పురుషుని ఇంద్రుడు నాలుగు దిక్కులుగను, దిక్కోణములుగను దర్శించెను.

ఈ విధమున సకల చరాచర జగత్తుకు ఆధారభూతమయిన శక్తి లేక చైతన్యమును గుర్తించి, తన నుండి ఈ జగత్తు వేరు కాదనియు, తనయందు ఈ జగత్తును, ఈ జగత్తునందు తనను అనుభవపూర్వకముగ గుర్తించినవాడు జనన మరణముల కతీతమయిన ముక్తస్థితిని పొందును. ఆయనను ఈ విదముగా నాత్మస్వరూపునిగా సర్వభూతాంతరాత్మగా 'నేను' అను ఆదిత్యవర్ణముగ తెలిసికొనుట కంటె వేరు మార్గము లేదు.

Note: This book contains printing mistakes in the sanskrit verses

యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాః తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తేహనాకం మహిమానస్సచన్తే యత్రపూర్వే సాధ్యాస్సంతి దేవాః॥

తాత్పర్యము :

దేవతలు యజ్ఞపురుషుని సర్వహుతమగు యజ్ఞమున యజనము గావించి అర్చించిరి. అనిన సృష్టిని యజ్ఞమయముజేసిరి. అట్టి యజ్ఞమే జగత్తును నిలబెట్టు ధర్మము. ఇది ప్రథమముగా సృష్ట్యాదిలో నేర్పడినది. ఈ యజ్ఞము వలననే పూర్వము 'సాధ్యుల'ను వారెల్లరును మహాత్ములై దేవతలుగ స్వర్గమును పొందిరి.

వివరణ :

సృష్టిలయములు నిత్యము పునరావృతమగుచుండు ఆద్యంత రహితములగు క్రియలు. ఇవి ఒకే సూత్రమున కాధారముగా ఒక నిర్ణీతమగు ధర్మము ననుసరించి జరుగును. ఇదియే సృష్ట్యాదిలో నేర్పడిన ధర్మమని చెప్పబడినది.

సకల సృష్టికి ఆధారమగు చైతన్యము వివిధ స్థాయిలుగ నేర్పడినపుడు వ్యక్తిత్వము గల్గిన ఒక్కొక్క స్థాయి ఒక్కొక్క దేవతగా చెప్పబడినది. ఆదిశక్తి నుండి ఉత్పన్నమయిన సృజనాత్మక శక్తి స్థాయిలే ఈ ఋషులు, సాధ్యులు. ఈ ఋషులు సృష్టి కార్యము కొరకు సమిష్టిగా నిర్వహించు ప్రక్రియయే ఈ పురుషయజ్ఞము. ఇట్టి సృష్టి యజ్ఞ క్రియను నిర్వహించుట ద్వారా ఋషులు, సాధ్యులు ఆదిపురుషుని (లేక ఆది చైతన్యము) యొక్క సహజ స్థితిని తదనుశ్రుతమగు సృష్టి ధర్మమును గుర్తించెదరు.

ఆది చైతన్యమునుండి సాధ్యులు, సిద్ధులు, దేవతలు సృష్టి సంకల్ప రూపమున వెలువడుట యజ్ఞము. వారు తిరిగి తమ ప్రవృత్తిననుసరించి యా సృష్టిని కొనసాగించుట మరియొక యజ్ఞము. కనుకనే వారు యజ్ఞముచేత యజ్ఞము చేసిరని చెప్పబడినది.

Note: This book contains printing mistakes in the sanskrit verses

# అనువాకము

అద్భ్యః స్సంభూతః పృథివ్యై రసాశ్చ విశ్వకర్మణః సమవర్తతాధి ।
తస్య త్వష్టా విదధ ద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజానమగ్రే॥

తాత్పర్యము :

ఈ పురుషుడు జలముల నుండియు, భూమియొక్క సారము (అన్నము) వలననూ విశ్వకర్మ సహాయమున (జీవునిగా) జన్మించెను. ఆతనికి త్వష్టయను ప్రజాపతి రూపమును కల్పించెను. ఈసృష్టి యంతయు బహిర్గతమగుటకు పూర్వము జానలోకమున నున్నది.

వివరణము :

ఇందు పురుషుడు జీవున్ని నుద్భవించుట వివరింపబడినది.

పురుషుడు జలమునుండి వుద్భవించెనని చెప్పుటలో జీవభూతుడైన పురుషుడు మాతృగర్భమున (పృథ్వి, ప్రకృతి) గర్భోదకమునందు పిండరూపమున వృద్ధిచెంది జన్మించెనని యర్థము. సకల జీవులు ఆదిపురుషుని రూపమలే గనుక పురుషుడు నిత్యము జీవుల రూపమున జన్మించుచుండును.

జలమునుండి యుద్భవించిన పురుషుడనిన జలస్వభావమగు చలనము కలిగియున్నట్టి చైతన్యమునుండి యుద్భవించిన సంకల్పమని గూడ నర్థము. అతడే గర్భస్థ జలమునుండి యుద్భవించు జీవాత్మ, ఆతడే బ్రహ్మజ్యోతియనియు, హిరణ్య గర్భుడనియు అయోని సంభవుడనియు, చైతన్య స్వరూపుడూ, విశ్వాత్మకుడు అనియు, జగత్తంతటికిని ప్రాణస్పందనాత్మక శక్తియనియు తెలిసికొనవలెను.

భూమియొక్క సారమగు అన్నమునుండి జన్మించినట్లు చెప్పబడిన పురుషుడు ఈ యన్నముచేత వృద్ధిపొందు జీవరూపుడు. అతడే అన్నమయ స్వరూపుడగు జీవుడు. ఈ పురుషునకు (జీవునకు) రూపమును కల్పించువాడు 'త్వష్ట'యని చెప్పబడినది. సృష్టికన్యముగ తననూ, తనకన్యముగ భిన్నరూపమున ఇతర జీవులను వస్తువులను

దర్శించు ప్రజ్ఞయే 'త్వష్ట'. 'రస' యను పదమునకు అనుభవమను అర్థముగూడ కలదు. మాతృగర్భమున పిండము జలమునుండి యుత్పన్నమై అందే యుండినట్లు ఈ నామరూపాత్మకమగు విశ్వము గూడ సర్వవ్యాప్తమయిన ధార్మికశక్తిక్షేత్రముల నుండి ఉత్పన్నమై యుండినట్లు సూచించబడినది. అదియే రసము. రసమనిన అట్లనుభవమగునది. సగుణ బ్రహ్మమని గూడ చెప్పవచ్చును.

**వేదాహమేతం పురుషం మహాన్తమ్ ఆదిత్య వర్ణమ్ తమసఃపరస్తాత్ ।**
**తమేవం విద్వానమృత ఇహభవతి నా ఽ న్యఃపన్థావిద్యతే ఽ యనాయ ॥**

**తాత్పర్యము :**

సకల చరాచర జీవరాసుల సృష్టికిని వివిధ వస్తు బాహుళ్య మేర్పడుటకును కారణభూతుడై యన్నిటా తానే వ్యాపించియున్న పురుషుడు"చీకటి" కవ్వల ఆదిత్యవర్ణమున బ్రహ్మ జ్యోతిగా వెలుగొందు వానిగా నేనెరుగుచున్నాను.

**వివరణము :**

సృష్టిలోని అన్నిరూపములగూర్చి వివేచించి సాత్వికబుద్ధిగల వాడు అన్నిటా ఆ పరమపురుషుడే యున్నాడని తెలుపునామములను వాటికి కల్పించి ఆ నామములను పఠించుచు, పురుషునకభివందనము చేయుచు "అజ్ఞానమను పెనుచీకటి కావలియెుద్భగనున్న జ్ఞానమును, సూర్యకాంతితో సమమగు తేజోరూపమునగల మహాత్ముడైన యీ పురుషుని తెలుసుకొందునుగాక"యని తెలిసికొనినవాడు ఆత్మజ్ఞాని యగును.

బహిర్ముఖమై యున్న ఇంద్రియమనస్సులు అజ్ఞానాంధకారము. అవి యంతర్ముఖ మయినపుడు తెలియు 'నేను' అను ప్రజ్ఞానమే సర్వవ్యాపకుడైన పురుషుడు. సత్వప్రధానమగు వివేకము, సాత్వికబుద్ధి యిట్టి సత్య దర్శనమునకు హేతువు. అది కలిగినవాడు ధీరుడు. అట్టి బుద్ధియే రజస్తమో [illegible]ఛాయిష్టమయినపుడు సృష్టిని రూపాత్మకముగ మాత్రమే దర్శించి నామములను [illegible]ంచును. జ్ఞానాజ్ఞాన స్థితుల కాధారమైన చైతన్యము మాత్రము తత్త్వతః ఆ

పురుషుడే. సృష్ట్యాదియందు పూర్వకల్పమున జగత్తు రూపమున ప్రవర్తిల్లిన సంస్కారములు తిరిగి ప్రకటమగుట యిప్పుడు జీవులకు జగత్తట్లే గోచరించుటకు కారణము. ఇట్టి సృష్టి స్థితిలయములను ఆయా జీవుల రూపమున అనుభవించు పురుషుడే కర్త, భోక్త, జ్ఞాని, అజ్ఞానికూడా.

**ప్రజాపతిశ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే ।**
**తస్యధీరాః పరిజానంతియోనిమ్ మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః॥**

**తాత్పర్యము :**

సృష్టికర్తయగు ప్రజాపతియను పురుషుడు సృష్టిసంకల్పము వొంది గర్భస్థుడై తిరుగును. పుట్టుక లేని వాడయినను ఆయన అనేక రూపముల బహువిధ జన్మములు పొందుచుండును. ఆయన జన్మ వైచిత్ర్యములను, మూలతత్త్వమును ధీమంతులు మహనీయులు మాత్రమే తెలసికొనగలరు. ప్రజాపతులగు సృష్టికర్తలు తమకు మూలమగు జ్యోతిమార్గమును తెలిసికొనగోరుచుందురు.

**వివరణము :**

సర్వత్రా నిండియుండి తన యునికియొక్క స్ఫురణ గలిగియున్న ఆది చైతన్యము వివిధ స్థాయిలందు కక్ష్యలుగ నేర్పడుట వలన ఈ జగత్తేర్పడినది. ఇట్లు సృష్టియందలి సర్వజీవులకు వస్తు జాలములకు ఆధారమగు ఆది చైతన్యమే అట్టి రూపమున ప్రకటమగును. అనగా ఆది పురుషుని నుండి సకల సృష్టియు నుద్భవించి మరల ఆయనయందే లయము చెందుచున్నను ఇట్టి క్రియల వలన చలించని వాడయి స్థిరముగ సాక్షీభూతుడయికూడ యున్నాడు.

**యోదేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః।**
**పూర్వోయో దేవేభ్యో జాతః నమోరుచాయ బ్రహ్మయే ॥**

**తాత్పర్యము :**

ఎవడు దేవతలకన్నను మొదటివాడో, ఎవడు దేవతలకు హితము చేయుచు వారికొరకు వెలుగుచుండునో అట్టి బ్రహ్మజ్యోతి విశ్వాత్మఅగు పురుషునకు నమస్కారములు.

Note: This book contains printing mistakes in the sanskrit verses.

వివరణము :

దేవతలనిన సృష్టియజ్ఞమును నిర్వహించు ప్రజ్ఞామయ చైతన్యస్థాయిలు. దేవతల కొరకు వెలుగుననగా అట్టి సృజనాత్మక శక్తిస్థాయిల రూపముననున్న చైతన్యమును కాధారమగు ప్రజ్ఞగా వెలుగొందు చుండునని భావము.

ఈ సృష్టి జాలమంతయు జటిలమగు వివిధ కూర్పులతో కూడినది. ఈ సృష్టి తన క్రమమును తప్పి అసందర్భమగు మార్పులకు గురికాకుండా క్రమమార్గమున ప్రకృతి పరిణామముననుసరించి నడచుటకు ఆధారమయిన శక్తినే దేవతలని చెప్పబడినది. అట్టి శక్తికి ప్రబోధము కల్గించువాడు ఆదిపురుషుడు.

జీవుని శరీరమున యింద్రియ రూపముననున్న దేవతలకు హితముచేయు బుద్ధి స్వరూపమునకు మూలమయిన పురుషుడు పురోహితుడని చెప్పబడినది. అతడు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగువాటిద్వారా వెలుగు చైతన్య స్వరూపుడు. మనయందు అట్టి వెలుగును గుర్తించి ఆయనకు నమస్కారము చెప్పుటలో ఆ జ్యోతి యందు తన పరిమిత ప్రజ్ఞ లీనమై మోక్షపదము లభించును.

**రుచం బ్రాహ్మం జనయన్తః దేవాఅగ్రే తదబ్రువన్ ।**
**యస్త్యైవం బ్రాహ్మణోవిద్వాన్ తస్యదేవా అసన్వశే॥**

**తాత్పర్యము :**

సృష్ట్యాదియందు దేవతలు బ్రహ్మతేజస్సును ఉద్భవింప జేయుచు ఆ విశ్వమూర్తిని యిట్లు స్తుతించిరి : "ఎవరు నిన్ను ఈ విధముగా గుర్తించి తెలిసికొందురో అట్టివారికి దేవతలందర్వశులై యుందురు."

వివరణము :

జ్యోతి స్వరూపుడగు పురుషునిగూర్చి దేవతలెల్లరు ఫలశృతిని కీర్తించిరి. ఎవరు ఈవిధముగ ఆ పురుషుని అనుభవ పూర్వకముగ గుర్తించెదరో అట్టివారికి దేవతలు వశులగుదురు. అనిన ఆ సత్యమును దర్శించివాడు సృష్టికర్తలగు దేవతలయొక్క సామర్థ్యమును పొందును. తానును ఆదిపురుషుడై సంకల్పమాత్రమున సృష్టి చేయు

...ని పొందును. అనగా ఆదిపురుషుడే తానని గుర్తించును. అట్టి వాటిని మన శాస్త్రములు గురువని తెల్పి ఆతడే త్రిమూర్త్యాత్మకుడు, సర్వదేవమయుడు అని కీర్తించినవి. అట్టి తత్త్వవేత్త నాశ్రయించియే జ్ఞానము పొందనగునని ఛాందోగ్యోప నిషత్తు, భగవద్గీత (4:32) చెప్పుచున్నవి. అట్టివారు అవతార పురుషులు గనుక వారి నారాధించుట సాంప్రదాయమైనది. ఇంకను అట్టి జ్ఞానమును పొందుటయే పరమలక్ష్యమని ఈమంత్రము తెల్పుచున్నది.

**హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ అహోరాత్రే పార్శ్వే ।**
**నక్షత్రాణి రూపమ్ అశ్వినౌవ్యాత్తం ।**
**ఇష్టం మనిషాణ అముం మనిషాణ సర్వంమనిషాణ॥**

**తాత్పర్యము :**

నీకు శ్రీదేవియు, భూదేవియు భార్యలు. రాత్రింబవళ్ళు నీ కిరుప్రక్కలు. నక్షత్రములే నీయొక్క రూపము. అశ్వినులు నీముఖము. యజ్ఞము చేయబడిన దానిని (హవిస్సును) నా యీ సర్వమును స్వీకరించి మన్నింపుము.

**వివరణము :**

సృష్టియందలి శక్తి (శ్రీదేవి), నామరూపాత్మకమగు సకల సంపదయు (లక్ష్మి) పురుషుని వశమున ప్రవర్తిల్లుచుండును. అతని ఇరువురు పత్నులనిన ఉన్మేష నిమేషములు, రేయింబవళ్ళు, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, జనన మరణములు, సృష్టిలయములు మున్నగునవి ఆతనినాశ్రయించుకొని జరుగుటయని సూచింప బడినది. ఈ జంటలు ఆది పురుషుని రెండు పార్శ్వములు, ఆకాశమున వ్యాపించిన సూర్యాది గోళములు, నక్షత్రమండలములు ఆయన రూపము. కాలపరంపరన నడచు దివారాత్రముల కారంభకులగు అశ్వినులు ఆయన ముఖము (నోరు), అనిన సర్వమును భక్షించునట్టి కాలము ఆయన ముఖమని అర్థము. (అహోరాత్రములనిన జ్ఞానాజ్ఞానములనిగూడ తలంపవచ్చు.)

నాయందుగల యింద్రియ మనోబుద్ధి ప్రాణములన్నియు నీవిగా గ్రహించి ఉపవిత్ర యజ్ఞమున నివి యుపయోగించి తద్వారా నాకు అంతర్యామిత్వము సిద్ధించునట్లు చేయుమని దీనిభావము.

Note: This book contains printing mistakes in the sanskrit verses.

# ఫలశ్రుతి

పురుషసూక్తాన్ని నిత్యమూ భావయుక్తంగా పఠించడం, దాని అర్థాన్ని మననం చేయడం వ్యక్తులకూ సమాజానికీకూడా ఎంతో శ్రేయస్కరం.

పురుషడనబడే విశ్వ చైతన్యశక్తి తన సంకల్పాన్ననుసరించి అనేకమయినదనీ దానియొక్క వివిధ అంశాలు (దేవతలు, లేక ప్రకృతి శక్తులు) సామరస్యంగా పనిచేయడంవలన ఈ సృష్టి యిలా కొనసాగుతూందనీ ఈ మంత్రం చెబుతుంది. ఈ భావాన్ని వ్యక్తులు బాగా మననంచేసి అట్టి దృష్టితో తక్కిన సృష్టినిగూర్చి దానిపట్ల తమవైఖరిని సంస్కరించుకుంటారు. క్రమంగా తనలో నేమున్నదో అదే అన్నిటిలోనూ నున్నదన్న సత్యం హృదయగతమైనప్పుడు కలిగే పర్యవసానమే ప్రేమ. పరమ ప్రేమరూపమే భక్తి. 'ఆత్మవత్సర్వభూతాని' అన్నట్లు సర్వజీవులపై అట్టి వ్యక్తికి ఆత్మీయత కలుగుతుంది. ఆ ప్రేమజ్యోతిలో స్వార్థ అహంకారాది ఛాయలు అంతరిస్తాయి. అది ఆత్మజ్ఞాన రూపమైన పరమశాంతికి కారణమవుతుంది.

సకల జీవులూ అట్టి శాంతిని తృప్తిని కోరుతాయి. దానికై అన్వేషిస్తూ వుంటాయి. ఇదే సర్వజీవుల జీవితకథ. కానీ బాహ్యసృష్టిలో సర్వజీవులు ఆ తృప్తికోసమై చేసేకృషి నిష్ఫలమవటం చూస్తాము. మానవులంతా ఎన్నివున్నా తృప్తిలేక ఆ తృప్తికోసమై కీర్తి, ధనము, అధికారము మొదలైనవాటి ద్వారా దాన్ని సాధింపయత్నించి ఆ ఫలితాన్ని పొందలేరు. ఎట్టి కొరతలేనిస్థితి ఎవరికీ లభించటంలేదు. కాని గాఢ నిద్రావస్థలో ప్రతివ్యక్తి దానినే పొందుతున్నాడు. ఆ స్థితిలో నిరుపేద, చక్రవర్తికూడా ఒకే తృప్తిననుభవిస్తారు. ఈతృప్తి వారికెలా వస్తున్నది?

తొట్టినిండా స్వచ్ఛమైన నీరున్నాయనుకోండి. ఆనీరు నిశ్చలంగా వున్నప్పుడు తొట్టి అడుగు స్పష్టంగా కనబడుతుంది. కానీ ఆనీరే కలతచెందినప్పుడు అదికన్పించదు. మనమే ఆతొట్టి, మనస్సే ఆనీరు. తొట్టి అడుగే గాఢనిద్రలో అనుభవమయ్యే శాంతి. నీరు కలతచెందుటయే మెలకువ, స్వప్న స్థితులలో కలిగే భావసంఘర్షణ.

Note: This book contains printing mistakes in the sanskrit verses

మామూలుగా మనకేఅనుభూతి కలిగినా అది జ్ఞానేంద్రియముల ద్వారా లభించవలసినదే. గాఢనిద్రలో అవి పనిచెయ్యవు గనుక అప్పుడనుభవమయ్యే శాంతి, తృప్తి బయటనుండి మనకు సంక్రమించేదికాదు. మనలోనే వున్నదన్నమాట. మెలకువ స్వప్నావస్థలలోని భావసంచలనము వలన అది మరుగుపడుతుంది. ఎట్టి కొరతాలేని అట్టి శాంతిని మనలో వుంచుకొని బయట జగత్తంతా వెతికితే ఎలా దొరుకుతుంది. మేకపిల్లను చంకనపెట్టుకొని ఊరంతా గాలిస్తే ఏమి ప్రయోజనం?

మనమూ సృష్టిలోని మిగిలిన వస్తువులూ వ్యక్తులూ తత్త్వతః భిన్నమని విశ్వసించటం వలన స్వార్థము, రాగద్వేషాలు బలపడతాయి. ఈ దృష్టి సంఘంలో అవినీతికిదారితీస్తుంది. అలాకాక పైన చెప్పినట్లు సృష్టిలోని వైవిధ్యం మన మనోయింద్రియ నిర్మాణాల పర్యవసానమేననీ తత్త్వతః అన్నీ ఒక్కటేననీ ఎంత దృఢంగా తెలిస్తే అంతమేరకు పై చెప్పిన దోషాలు పలుచబడతాయి. అట్టివారి జీవితాలు స్వార్థపూరితాలు కాక అంతమేరకు నిస్వార్థమైనవిగా, సృజనాత్మకము నిర్మాణాత్మకము అయినవిగా సంస్కరించబడతాయి. ప్రతివ్యక్తీ సమాజమనే దేహంలో దాని శ్రేయస్సుకై సామరస్యంగా పనిచేసే జీవకణాల లాగా పనిచేస్తారు. అంతమేరకు వ్యక్తిగతంగా కూడా వారు శాంతినీ తృప్తినీ పొందుతారు. నిస్స్వార్థమైన జీవితమే ఆనందదాయక మవుతుంది.

పురుషసూక్తంలోని భావాన్ని హృదయంలో నిలుపుకోవటం వలన మరొక ప్రయోజనంకూడా వుంది. పారమార్థిక సత్యం నామ రూప క్రియారహితమైనది మాత్రమేనన్న భ్రాంతి పీడుతుంది. సృజనాత్మకము నిర్మాణాత్మకము అయిన సృష్టిక్రియను నిర్వహించేదిగా, అట్టి రూపంతో వెలిగేదిగా కూడా అది దర్శనమిస్తుంది. ఆ సత్యాన్ని పారమార్థికులు గుర్తించినప్పుడు వారి జీవితాలు నిష్క్రియత్వానికి బంధింపబడవు. వ్యక్తులు తమ విధులను ఆ సృజనాత్మక మైనశక్తియొక్క క్రియలుగా దర్శించి కర్తృత్వ భోక్తృత్వ బంధాలలో తగులుకొనక కర్మబంధ విముక్తులై వెలయగలరు. కర్మ ఫలాపేక్షను మాత్రమే సన్యసించి తమ జీవితాలను నిష్కామకర్మ యోగంగా కొనసాగించగలుగుతారు. 'యోగః కర్మసు కౌశలమ్', 'సమత్వం యోగవుచ్యతే' అన్న గీతావాక్యాలు వారిజీవితాలలో సార్థకవుతాయి. ఆధ్యాత్మికానికి

ఐహికానికి గల వైషమ్యం అంతరించి ఐహిక పరమార్థాలకు ఏకైక మార్గంగా రూపొంది పరమార్థం ఐహికాన్ని నిర్దుష్టమొనర్చగలుగుతుంది.

నేటివిజ్ఞాన శాస్త్రం పురుషసూక్తంలోని భావాలను బలపరచడం ఎంతో ముదావహం. పురుషసూక్తార్థ దృష్టితో వాటినధ్యయనం చేస్తే నేటివిద్య నిరర్థకము గాక పరమ శ్రేయోదాయకవుతుంది. నేటి విజ్ఞానశాస్త్ర సహాయంతో పురుషసూక్తార్థాన్ని అవగాహన చేసుకోవడం వలన విజ్ఞానశాస్త్రం సార్థకమై పరమ శ్రేయస్సు ప్రసాదించగలుగుతుంది. పరమార్థాన్ని పొందడానికి నేటి విజ్ఞాన శాస్త్రాన్ని తోసిపుచ్చనక్కరలేదు. నేటివిజ్ఞాన శాస్త్రాన్ని ఆర్జించి వినియోగించుకోవడానికి పరమార్థాన్ని మూఢ విశ్వాసంగా అభూత కల్పనగా త్రోసిపుచ్చనక్కరలేదు. వేదాలు సత్యం కావడానికి నేటి విజ్ఞాన శాస్త్రాన్ని కాలతన్నవసరంలేదు. నేటి విజ్ఞాన శాస్త్రాన్ని ఆర్జించడానికి వేదాలను కాలదన్న నక్కరలేదు. సంపూర్ణ మనోవికాసాన్ని పొందిన ఆధునిక మానవుడుగా జీవించడానికి ప్రాచీన భారతీయ సంస్కృతిని నిరాకరించి కన్నతల్లిని విడనాడిన దౌర్భాగ్యులము కానక్కరలేదు. ప్రాచీన భారతీయ సంస్కృతి యొక్క వికాసరూపాలుగా జీవించడానికి అంతర్జాతీయ వైజ్ఞానిక ప్రగతికి కళ్ళు మూసుకొనవసరం లేదు. ఈ రెంటినీ చేకూర్చుకోవడానికి పురుషసూక్తం గొప్ప సహకారి. సంఘానికీ వ్యక్తికీ ఒకేసారి శ్రేయస్సును చేకూర్చగల పరికరము పురుషసూక్తం వంటి వేద మంత్రాలకు భిన్నంగా వేరొకచోట కనిపించదు. ఇది శృతిఫలము. అదే ఫలశ్రుతి.

"తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

సహనావతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై
ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాంతిః॥
'సర్వేజనా స్సుఖినోభవన్తు
లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు'.



Note: This book contains printing mistakes in the sanskrit verses.

## పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ స్వామి విరచితమైన
## అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయిలీలామృతము (మేలుప్రతి) | 75-00 |
| (సాదా ప్రతి) | 60-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 25-00 |
| సాయి సన్నిధి (బౌండు) | 55-00 |
| (సాదాప్రతి) | 45-00 |
| సాయినాథ స్తవనమంజరి | 2-00 |
| సాయినాథ పూజ | 10-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబా | 2-00 |
| సత్సంగము - భజన | 4-50 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 46-00 |
| పరిప్రశ్న | 20-00 |
| గుతమెందుకు? | 10-00 |
| ఏది నిజం? | 6-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 33-00 |
| శ్రీ గురుచరిత్ర (మేలు ప్రతి) | 75-00 |
| (సాదా ప్రతి) | 60-00 |
| దత్తావతార మహాత్మ్యం | 20-00 |
| సంహితాయన గురుద్విసాహస్రి (శ్రీ గురుచరిత్ర) | 35-00 |

### నేను దర్శించిన మహాత్ములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ పాకలపాటి గురువుగారు | 20-00 |
| 2. | అవధూత శ్రీ చీరాలస్వామి | 20-00 |
| 3. | శ్రీ ఆనందమయి అమ్మ | 20-00 |
| 4. | అవధూత శ్రీ వెంకయ్య స్వామి | 30-00 |
| 5. | టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 25-00 |
| 6. | హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 20-00 |
| 7. | స్వామి సమర్థ (అక్కల్‌కోట స్వామి) | 20-00 |

# Purushasuktha Rahasyamu

Pujya Acharya Sri Ekkirala Bharadwaja



జననం :
౧౯౩౮

మహాసమాధి :
౧౯౮౯

**ఈ గ్రంథము గూర్చి :**

ఆధునిక విజ్ఞాన సహాయంతో పరమాణువుకంటే సూక్ష్మ అంశాల తత్త్వాన్ని, శక్తి క్షేత్రాన్ని వివరించి పరమార్థాన్ని నిరూపించే జిజ్ఞాసువులు తరచుగా ఒక ప్రశ్న వేస్తారు: ఆ పరతత్త్వాన్ని శక్తిఅనో, చైతన్యమనో అనక 'దైవము' మొదలైన పదాలలో ఎందుకు మన పెద్దలు నిర్వచించారు? సృష్టికాధారమైన చైతన్య-శక్తి యన్ని రూపాలతో విలసిల్లే విశ్వాన్ని సృష్టించి ఆ రూపాలద్వారా ప్రకటమవుతుంది. ఇందులో ఒక్కొక్క జీవియొక్క దేహం విచిత్రము, క్రమబద్ధము, సంకీర్ణమూ అయిన కూర్పుగల్గి యుంటుంది. దానిని పురమంటారు. అందు వ్యక్తమగువాడు పురుషుడు. వ్యక్తి దేహాన్ని నిర్మించి తద్వారా వ్యక్తిగా గోచరించే చైతన్యమే నామరూపాత్మకమైనా ఈ విశ్వాన్ని తనరూపంగా కల్పించుకొని తద్వారా ప్రకటమవుతుంది. జీవాత్మ పురుషుడు. అతడి తత్త్వాన్ని గుర్తించ యత్నించినప్పుడు విశ్వ రూపుడైనవాడు, జీవరూపుడైనవాడు తత్త్వతః ఒకటేనని తెలియగలడు. అదే జ్ఞానం. అట్టి జ్ఞానాన్ని పొందటమే గమ్యం. దాని సాధనామార్గాన్ని, తాత్త్విక అవగాహనను ఇచ్చేదే పురుషసూక్తము.

Rs. 20/-